శ్రీ ర స్తు.

# శ్రీకృష్ణవాస్తుశాస్త్రము

అను

## వాస్తుసారసంగ్రహము

పేరుసోమల గణపయామాత్య ప్రణీతము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచేఁ బ్రకటితము

# పీఠిక

వాస్తుసారసంగ్రహమునకు నామాంతరము శ్రీకృష్ణ వాస్తుశాస్త్రము ఇది యనభిజ్ఞుల చేతుఁబడి తప్పులకుఁ దావలమయి యపార్థదోషదూషితమయి నిరుపయోగప్రాయ మైనది. చెన్నపుర ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁగల యొండు రెండు వ్రాత మాతృకల సాహాయ్యమున నిది పరిష్కృతమయి యిట్లు ప్రకటితమైనది. ఇపుడు గ్రంథము నిర్దుష్ట మనఁ దగి యున్నది.

ఈగ్రంథమును పేరుసోమల గణపయామాత్యుఁడు రచించినాఁడు. ఇతని తాత గణపరాజు; తండ్రి వెంగనామాత్యుఁడు; తల్లి మల్లమ్మ; తన కిరువురు మిత్రు లీపుస్తకము రచియింపఁ దోడు పడిరని యీతఁడు కృత్యాదినిఁ గల 'మిత్రులైనట్టి...' అను పద్యమునఁ జెప్పికొనినాఁడు. ఆ పద్యము నిర్దుష్టము కాకుండుటచే వారి పేరులు సరిగా గుర్తింపరా కున్నవి. ఈగ్రంథము పేరుసోమల గ్రామమున నెలకొనిన మదనగోపాలదేవున కంకితము.

గ్రంథమునఁ గవిత్వము దోషజుష్టమని చెప్పఁబనిలేదు. ఇట్టి శాస్త్రగ్రంథములు విషయప్రధానములు కాని భాషాప్రధానములు కావు.

ఇందలి విషయము నూతనముగ నిండ్లను గట్టించుకొని సుఖింపఁ గోరువా రెల్లరకును దెలియవలసినది. పాఠకులకు

బద్ధ్యములఁ గలవిషయము సుగమముగఁ దెలియునట్లు తాత్పర్య మిందుఁ గలదు.

వ్యయప్రయాసముల కోర్చి యీ పుస్తకమును సంస్కరింపఁజేసి, ముద్రించి యాంధ్రలోకమున కందఁజేసిన శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వా రభినందనార్హులు.

చెన్నపురి
10-6-1949

'ఆచార్య'

# విషయసూచిక


| విషయము. | పుట. | విషయము. | పుట. |
|---|---|---|---|
| షష్ట్యంతములు | 4 | పల్లమున మృజ్జలముల నిండించు విధము; ఫలము | 25 |
| సౌరమానసంక్రాంతిఫలము | 8 | జలావర్తలక్షణము | 26 |
| పక్షఫలము | 9 | హస్తప్రమాణము | ,, |
| పక్షనిర్ణయము | ,, | ప్రాక్సాధనశంకులక్షణము | 29 |
| తిథిఫలనిర్ణయము | 10 | ప్రాచీసాధనము | ,, |
| వారఫలము | ,, | సూత్రలక్షణము | 31 |
| నక్షత్రఫలము | 11 | శంకుసూత్రలక్షణము | 32 |
| యోగకరణఫలము | ,, | సూత్రమునుబట్టు లక్షణము | ,, |
| సూర్యచారఫలము | 12 | శంకుభంగమాత్రత్రుటనఫలము | 33 |
| కుజచారఫలము | 13 | శల్యపరీక్ష | 34 |
| కుజచారదోషపరిహారము | ,, | వర్గాక్షరప్రశ్నఫలము | 35 |
| బుధగురుచారముల ఫలము | 14 | గృహావరణమునందు వివిధజంతు శల్యములకు ఫలము | 40 |
| శుక్రశనిరాహుచారముల ఫలము | 15 | గుణావర్తనము | 42 |
| గురుశుక్రాస్తమయాదుల ఫలము | 16 | గుణావర్తనమును నింపుట | ,, |
| వర్ణేశ్వరఫలము | ,, | జలగతిలక్షణము | 43 |
| లగ్నఫలము | ,, | ఏకాదశవర్గువు | 44 |
| లగ్నగతగ్రహఫలము | 17 | ధనఋణములు | 45 |
| దిగాయురాశివిరోధములకు ఫలము | ,, | ఆయములు | ,, |
| వర్గాధూఢము | 18 | తిథులు | 48 |
| నామరాశినిజాంచులక్షణము | 21 | వారములు | 49 |
| గ్రాహ్యక్షేత్రరసగంధస్వరూపము | 24 | వారములకుఁ గరణములు | ,, |
| భూప్రార్థన | 25 | నక్షత్రములు | 50 |
| బలివిధి | ,, | | |
| భూతోచ్చాటనము | ,, | | |

| విషయము. | పుట. |
|---|---|
| యోగములు | 51 |
| నక్షత్రయోగములు, తత్ఫలము | ,, |
| కరణములు | 52 |
| అంశలు | 53 |
| ఆయుః పరిమాణ దిక్ప్రతిఫలములు | ,, |
| ఘాతకులలగ్నములు | 54 |
| రాశ్యధిపతి, క్రూరసౌమ్య, వర్ణనిర్ణయము | 55 |
| నవవర్గగణితవిధానము | 56 |
| షడ్వర్గగణితవిధానము | 57 |
| అందుఁ గర్తృనక్షత్రనిర్ణయము | 58 |
| స్థానబలమును జూచుపద్ధతి | 59 |
| తారాబలమును దెలియువిధము | 60 |
| నక్షత్రవేధ | 61 |
| గ్రహములశత్రుత్వమిత్రత్వఫలము | 62 |
| రాశ్యధీశ్వరశత్రుత్వమిత్రత్వఫలము | 64 |
| నక్షత్రగణములు | ,, |
| గ్రహములవర్ణవిభాగము | 64 |
| నక్షత్రయోనికూటము | 66 |
| మాసక్రమవాస్తుపురుషస్థితి | 67 |
| వాస్తుపురుషునినాభిస్థాననిర్ణయము | 69 |
| ఘాతఫలనిర్ణయము | ,, |
| వృక్షనక్షత్రములు | 71 |
| గ్రామ్యములగు వృక్షములు | 75 |
| శంకుస్థాపనము | 76 |
| దగ్ధజ్వలితధూమితతారలు | 77 |
| జీవనిర్జీవరోగతారలు | 78 |
| గృహకర్ణికాచక్రము | 78 |
| ఘటికానిర్ణయము | 80 |
| లగ్నపరిమాణము | 81 |
| కేంద్రత్రికోణనిర్ణయములు | 83 |
| గ్రహదృష్టినిర్ణయము | 84 |
| గ్రహదృష్టిబలనిర్ణయము | ,, |
| గురుశుక్రచంద్రులకు బాల్యవృద్ధత్వనిర్ణయము | ,, |
| లగ్ననిర్ణయము | 85 |
| లగ్నగ్రహసంపత్తి | 86 |
| శంకుస్థాపన స్తంభప్రతిష్ఠాసమయఫలము | 87 |
| శంకుదారులక్షణము | ,, |
| శంకుదారుప్రమాణనిర్ణయము | ,, |
| శంకునిర్మాణము | 88 |
| చెక్కుపాటులక్షణము | ,, |
| శంకుస్థాపనవిధి | 90 |
| వాస్తుపురుషధ్యానము | ,, |
| దిగ్రాశినిర్ణయము | 91 |
| వాస్తుపురుషదృష్టిద్వారనిర్ణయము | ,, |
| మాసద్వారనిర్ణయము | 92 |
| సౌరమానమాసనిర్ణయము | ,, |
| కర్తృరాశ్యనుకూలద్వారనిర్ణయము | 93 |
| అష్టభాగద్వారఫలనిర్ణయము | ,, |
| గ్రహభాగఫలద్వారనిర్ణయము | 95 |
| ద్వారబంధలక్షణము | 96 |
| చోరగండికి | 97 |

| విషయము. | పుట. |
|---|---|
| ద్వారబంధ ఖట్వా కవాటదారు నిర్ణయము | 97 |
| ద్వారబంధ కవాటములకు లగ్న నిర్ణయము | 99 |
| క్షేత్రభాగ గృహనిర్మాణ లక్షణము | ,, |
| భిత్తిప్రమాణము | 100 |
| గోడలు విరిగినందుకు ఫలము | ,, |
| జాలకములు | 101 |
| భిత్తినిర్మాణలక్షణము | ,, |
| స్తంభప్రతిష్ఠకు తిథిశుద్ధి | ,, |
| వారశుద్ధి | 102 |
| నక్షత్రశుద్ధి | ,, |
| స్తంభప్రతిష్ఠకు గ్రహశుద్ధి, లగ్నశుద్ధి | 103 |
| స్తంభఘాతమునకు గాలగర్భగతి | ,, |
| సూర్యచంద్రగతులు | 104 |
| వివాహవేదికా స్తంభలక్షణము | 106 |
| లగ్నగతగ్రహఫలము | 107 |
| రాజయోగము | 108 |
| ఆయుర్యోగము | 110 |
| పట్టికాబంధము | 111 |
| దారుసంధిని లక్షణము | 112 |
| గృహోన్నతసూత్రము | 113 |
| ఏకశాల లక్షణఫలము | 114 |

| విషయము. | పుట. |
|---|---|
| ద్విశాలలక్షణము—ఫలము | 115 |
| త్రిశాలలక్షణము—ఫలము | 116 |
| చతుశ్శాలలక్షణము—ఫలము | 117 |
| అష్టవిధగృహాదిజ్నిర్ణయము | 119 |
| మధ్యగృహనిర్ణయము | 120 |
| రంధ్రగృహపల్లీగృహశాచ గృహ లక్షణము | 121 |
| నాట్యశాలాలక్షణము | 122 |
| మల్లశాలాలక్షణము | ,, |
| అష్టవాటములు | 123 |
| గజోష్ట్రాశ్వపశువులశాలల శాయ నిర్ణయము | 124 |
| దేవర అరుగులకు లక్షణము | ,, |
| వటువేదిశాలలక్షణము | 125 |
| వివాహవేదిశాలలక్షణము | ,, |
| కూపఖననలక్షణము | ,, |
| ఉద్యానవనలక్షణము | 126 |
| ఉలూఖలస్థాపనము | 127 |
| పదుల్లునిలుపుటకు లక్షణము | ,, |
| ప్రొయ్యివేయుటకు లక్షణము | 128 |
| మంచములు, పీటలు | ,, |
| కంచములు దోలిచి నీళ్లను జల్లవలసిన దిశలు | 129 |

## ప్రాచీసాధనవిధానము




[౩౦-వ పుట జూడుఁడు.]

శ్రీ ర స్తు

# శ్రీ కృష్ణవాస్తుశాస్త్రము

అను

# వాస్తుసారసంగ్రహము

తాత్పర్యసహితము

---

ఉ. శ్రీమహిళామనోవిభుఁడు చిన్మయమూర్తి సమస్తదేవతా
గ్రామణి వారిజాసనసురస్తవనీయపదారవిందుఁడు
ద్దామయశోధురంధరుఁడు తామరసాక్షుఁడు పేరసోమల
గ్రామనివాసుఁడాశ్రితశరణ్యుఁడుకృష్ణుఁడు మమ్ముఁ బ్రోవుతన్.

లక్ష్మీదేవికి భర్తయును, చిత్స్వరూపుఁడును, సకల దేవతలలో శ్రేష్ఠుఁడును, బ్రహ్మ మొదలగు దేవతలచేఁ గొనియాడఁదగినవాఁడును, అధికమైన కీర్తిగలవాఁడును, పద్మముల బోలు నేత్రములు గలవాఁడును, పేరసోమల యనుగ్రామమున నివసించువాఁడును, ఆశ్రయించినవారలఁ గాపాడువాఁడును నగు కృష్ణుఁడు మమ్ము రక్షించుగాక!

క. శిరమునఁ జందురురేకయుఁ
గరములఁ బాశాంకుశములు ఘనతరలీలన్
ధరియించు సర్వసేవ్యుఁడు
కరిముఖునకు వందనములు గావింతు మదిన్. 2

తలయందుఁ జంద్రుని ధరించినవాఁడును, చేతులయందుఁ బాశాంకుశములను నాయుధంబులను ధరించినవాఁడును, సకల జంతువులకు సేవించఁ దగినవాఁడును, ఏనుఁగు మొగమువంటి మొగము గలవాఁడును నగు విఘ్నేశ్వరునకు నమస్కరింతును.

క. అనుపమభక్తి ఘటించెద
మనవిగ నంజలి సనత్కుమారాదిమహా
మునులకు వాస్తువిధిజ్ఞుల
కనఘుతరతపఃప్రభావహార్ద్రాత్ములకున్. 3

అధికమగు తపోమహిమచే సంతసించుచున్న మనస్సు గలవారును, వాస్తుశాస్త్రమును సమగ్రముగఁ జదివినవారును నగు సనత్కుమారాదిమునులకు నిరుపమానమగు భక్తితో వినీతుఁడనై నమస్కరింతును.

క. నిరతము విద్వత్సంగతి
దిరముగఁ దద్గ్రంథమహిమఁ దెలియుటకతనన్
విరచింతుఁ బద్యఘటితుల
సరసంబుగ వాస్తుసారసంగ్రహ మవనిన్. 4

ఎల్లప్పుడును విద్వాంసులయొక్క సాంగత్యముచేతను, ఆ(వాస్తు)గ్రంథముయొక్క మహిమ నెఱిఁగియుండుటవలనను బద్యరూపముగా 'వాస్తుసారసంగ్రహమును' రచియించు చున్నాను.

సీ. శ్రీకృష్ణపదపద్మ సేవాధురీణుఁడ
వాసిష్ఠగోత్రసంభవుఁడ ఘనుఁడ
ననుపమానాశ్వలాయనమానిసూత్రుండ
విద్వత్కవీశ్వరవినయపరుఁడ
శ్రీమంతుఁ డగు పేరుసోమలశివరాజ
వంశవార్ధికిని జైవాతృకుఁడను

గమనీయగుణకీర్తిగణపరాణ్మంత్రికిఁ
బౌత్రుండఁ బరమపవిత్రచరిత
మల్లమకు వెంగనామాత్యమణికి సుతుఁడ
సకలసిద్ధాంతగణితశాస్త్రజ్ఞుఁ డెంచ
వాస్తుశాస్త్రంబు గావించి వార్తఁ గాంచి
మహినిఁ జెలువొందు గణపయామాత్యకవిని. 5

శ్రీమన్నారాయణుని పాదపద్మములయందు భక్తిగలవాఁడను, వసిష్ఠగోత్రమునందుఁ బుట్టినవాఁడను, నిరుపమానుఁడగు నాశ్వలాయన మునివరుని సూత్రముగలవాఁడను, విద్వాంసులకును, కవీశ్వరులకును నమ్రుఁడను, జననమాదిగ నైశ్వర్యము గలవాఁడను, పేరుసోముల శివరాజు వంశమునఁ బుట్టినవాఁడను, మనోహరములగు గుణములును, కీర్తియును గల గణపరాజను మంత్రిపుంగవునకు మనుమఁడను, పవిత్రచరిత్ర యగు మల్లమకును వెంగనామాత్యునకునుఁ బుత్త్రుఁడను, నగు నేను సిద్ధాంత గణితశాస్త్రమునందు నేర్పరులగు పండితులందఱు సంతసముఁ బొందునట్లు వాస్తుశాస్త్రమును రచించి ఖ్యాతిఁ గాంతును.

ఉ. సారసమైన వాస్తువును సఖ్యతగా నొనరించి చేసెదన్
గారవ మొప్పఁ గూర్చెదను గూర్పఁగ నెంతటివాఁడనైన నా
నేరిచినట్ల యొక్కకృతి నిర్మితిఁ జేసెద నందు నేరుపుల్
నేరములుం గ్రహించి కరుణింపఁదగుం గవులార మ్రొక్కెదన్.

మనోహర మగు వాస్తుశాస్త్రమును జక్కఁగాఁ రచియించెదనని తలఁచితిని. ఇట్లు సేయుటకు నే నెంతటివాఁడను?

అయినను నాశక్తికొలఁదిఁ జేయుచున్నను. కావున నోపండితోత్తము లారా, నా గ్రంథమునందలి గుణదోషములను జక్కఁగా విచారించి నన్ను మన్నింతురుగాక యని మీకు నమస్కరింతును.

తే. *మిత్రులైనట్టి నిశ్చలమెట్ల శ్రీహ
రియును యద్దొనికొండమంత్రియును నుభయ
భాషలకు వాక్సహాయులై ప్రబలునపుడు
దగుకృతి యొనర్చుటకు నసాధ్యంబు గలదె! 7

మిత్రులగు నిశ్చలమెట్ల శ్రీహరియు, యద్దొనికొండ మంత్రియు నను నిరువురును గీర్వాణాంధ్రభాషలయందుఁ గడు నిపుణులు. ఇట్టివారు నాకు సహాయులైయుండగ నాకుఁ గొదువ కొంచెమైనను లేదు.

క. వాస్తుగతు ల్బహువిధముల
విస్తార మొనర్ప గ్రంథవిస్తార మగుఁగా
ప్రస్తావముకొలఁదిని గృహ
వాస్తువుమాత్రం బొనర్తు వసుధం దెలియన్. 8

వాస్తుశాస్త్రముయొక్కరీతు లనేక విధములుగ నున్నవి. అట్టి శాస్త్రమును జక్కఁగ నాలోచించి నాదు శక్తికొలఁది యెల్లవారును సంతసించునట్లు గృహవాస్తువును మాత్రము చెప్పెదను.

**షష్ఠ్యంతములు**

క. శ్రీరమణీసుఖరతికిన్
సారయశోధృతికి దివిజసన్నుతకృతికిన్

* ఈపద్యములు రెండును వ్రాతప్రతులయందు గానరావు.

చారుదయాలంకృతికిని
భూరిగుణోన్నతికి మేరుభూధరధృతికిన్. 9

క. నిరుపమఘనగాత్రునకున్
బరమపవిత్రునకు భక్తవనచైత్రునకున్
శరణాగతమిత్రునకున్
సరసిజనేత్రునకు దైత్యజనజైత్రునకున్. 10

క. నిగమాగమవాక్యస్ఫుర
దగణితసుషమాయుతాయుతాంబరమణికిన్
దిగధిపనుతగుణమణికిన్
జగదాదరణీయజారచౌర్యాగ్రణికిన్. 11

క. మాఘపనమణిప్రావృ
ణ్మేఘనిభశరీరునకు మణీహారునకున్
శ్లాఘితఘోషకుటీరప
యోఘృతచోరునకుఁ ద్రిభువనోద్ధారునకున్. 12

క. ఖరకరకిరణస్ఫురదురు
సురుచిరచేలునకుఁ బేరుసోమలనగర
స్థిరనిత్యోత్సవపూజా
గురుతరఖేలునకు మదనగోపాలునకున్. 13

లక్ష్మీ మనోహరుఁడును, శ్రేష్ఠమైన కీర్తిగలవాఁడును, దేవసన్నుతుఁడును, దయయే సుందరమగు నలంకారముగఁగల వాఁడును, గొప్పగుణములు గలవాఁడును, మేరుపర్వతము వంటి ధైర్యముగలవాఁడును, నిరుపమానమగు శరీరముగల వాఁడును, మిక్కిలి పవిత్రుఁడును, భక్తులకోర్కెలఁ దీర్చు వాఁడును, శరణాగతులకు మిత్రుఁడును, పద్మనేత్రుఁడును,

దానవకులాంతకుఁడును, నిగమాగమములఁ బ్రకాశించు చక్కని కాంతిగలవాఁడును, దిక్పతులుకొనియాడు సద్గుణములుగల వాఁడును, జారచోరులలో మిన్నయగువాఁడును, ఇంద్రనీలము వలెను, వర్షాంబుదమువలెను శ్యామలమయిన దేహముగల వాఁడును, సుందరుఁడును, వ్రేపల్లెయందు క్షీరఘృతములను దొంగిలువాఁడును, త్రిలోకోద్ధారకుఁడును, సూర్యకిరణముల వలె మిఱుమిట్లుగొలుపువట్టి పుట్టముగలవాఁడును, పేరుసోమల గ్రామమున నెలకొని నిత్యోత్సవాదులఁ బడయుచున్న వాఁడును నగు మదనగోపాలునకు.

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన వాస్తుసారసంగ్రహ లక్షణమునందు గృహారంభ మాససంక్రాంతిపక్షతిథివారనక్షత్ర యోగకరణ గ్రహచారలగ్న శుభాశుభంబులును, దిగాయరాశివిరోధవర్ణారూఢ క్షేత్రగ్రామాద్యర్ణనామరాశి బలంబులును, వర్జనీయ వర్ణ క్షేత్ర గంధరసంబులును, గ్రాహ్య క్షేత్రవర్ణగంధరసంబులును, భూప్రార్థనాభూతోచ్చాటనంబులును, మృత్పూర్ణజలపూర్ణజలావర్తఫలంబులును, చతుర్విధ హస్తమానాంగుళి మాత్రాంగుళదండ ప్రమాణంబులును, ప్రాచీనసాధనశంకుసూత్రలక్షణ ప్రశంసలును,శంకుభంగసూత్ర త్రుటనఫలంబులును, శల్యపరీక్షయు, గుణావర్తనవిధియు, జలగతిమార్గంబును, చతుర్దశైకాదశనవమద్వారలక్షణంబులు గణితాగత ధనఋణాయదివస వారనక్షత్రయోగకరణాంశాయుష్యాంశాధీశ భూతకులలగ్న శుభాశుభనిర్ణయంబును, రాశికూటంబును, రాశీశ్వరఫలంబును, స్థానబలంబును, తారాబలంబును, వేధకూటంబును, గ్రహమైత్రియు,

గణకూటంబును, యోనికూటంబును, మాస సంక్రాంతి వాస్తు పురుషగతిక్రమంబును, వనయాత్రయు, గ్రాహ్యాగ్రాహ్య వృక్షపరీక్షయు, శంకుస్థాపనంబును, గృహకర్ణికాచక్రంబును, చెక్కపాటుఫలంబును, శంకుస్థాపన వాస్తుపూజావిధానంబును, ద్వారనిర్మాణంబును, ద్వారబంధ కవాటంబుల తెఱంగును, క్షేత్రభాగభిత్తిప్రమాణంబులును, కాలసర్పగతివిధానంబును, స్తంభప్రతిష్ఠాప్రకారంబును, లగ్నగతగ్రహఫలంబులును, పట్టికాబంధనసాధనంబులును, దారుసంధివిధంబును, ఏకశాల ద్విశాల త్రిశాల చతుశ్శాల అష్టశాల వీధిశాలలును, రంధ్రగృహపల్లిగృహకాచిగృహములును నాట్యశాల మల్లశాలలును, నష్టవాటంబుల రూపనిర్ణయంబును, కూప ఖననిరూపణంబును, గృహాంగణవృక్షనియమంబును, గృహోపకరణ నిశ్చయంబును గ్రమంబుగ వివరించెద. 14

స్పష్టము.

సీ. చైత్రంబు ధనహాని, జయము వైశాఖంబు,
జ్యేష్ఠంబు మృతిభీతిఁ జేయునిజము,
ఆషాఢమునఁ బశుహరణంబు, శ్రావణ
మున భృత్యసంతతి మొనయఁ జేయు,
భాద్రపదంబున బహురోగములు సెందు,
కలహ మాశ్వయుజంబు, కార్తికంబు
శ్రీప్రదంబగు, మార్గశీర్షంబు భయ మగు,
నల పుష్యమునఁ జెందు నగ్నిభయము,
భాగ్యకరమగు మాఘంబు, ఫాల్గునమున
రత్ననాశంబుఁ జేయు ప్రయత్నమునను,

అధికమాసము క్షయమాస మశుభదంబు
లనుచుఁ జెప్పిరి మునివర్యు లబ్జనాభ! 15

చైత్రమాసమున నిండ్లుగట్టిన ధనహానిగలుగును; వైశాఖమున జయము గలుగును; జ్యేష్ఠమాసము మృత్యుభయమును గలుగఁజేయును; ఆషాఢమునఁ బశుక్షయ మగును; శ్రావణమున భృత్యులు గలుగుదురు; భాద్రపదమున రోగములు గలుగును; ఆశ్వయుజము కలహమును గలిగించును; కార్తికము లక్ష్మీప్రదము; మార్గశీర్షమున భయము గలుగును; పుష్యమగ్నిభయమును గలుగఁజేయును; మాఘము భాగ్యప్రదము; ఫాల్గునము రత్ననాశము గలుగఁజేయును; అధికమాస క్షయమాసములు అశుభదములు. కావునఁ నీ మాసములయందుఁ గలిగెడు శుభాశుభములఁ దెలిసి యిండ్లను గట్టఁ దగును.

### సౌరమాన సంక్రాంతిఫలము

సీ. మేషంబు శుభము నిర్మించు వృషంబు దా
ధనమిచ్చు మిథునంబు దనరుఁగడు
కర్కటకంబుఁ దాఁ గలిగించుఁ బశువృద్ధి
సింహంబు భృత్యులం జేరజేయుఁ
గన్య రోగంబును ఘటియించుఁ దుల సౌఖ్య
మలవడుం వృశ్చికం బర్థవృద్ధి
కార్ముకంబును హానిఁగల్గించు మకరంబు
బహుధాన్యమిచ్చుఁ గుంభమును రత్న
ములు ఘటించు మీనమున భయం బొదవించు
సంక్రమణ ఫలముల జాడలెల్ల

నెఱిఁగి కట్టుఁ డిండ్ల నెన్ని విధంబుల
ధీరమతులు దీనిఁ దెలిసి కృష్ణ! 16

మేషసంక్రాంతి శుభముల నిచ్చును; వృషభము ధనము నొసఁగును; మిథునమునఁ గీడు గల్గును; కర్కటము పశువృద్ధిఁ గలుగఁజేయును; సింహము ధనప్రదము; కన్యయందు రోగము కలుగును; తుల సౌఖ్యము నిచ్చును; వృశ్చికమున ధనవృద్ధి యగును; ధనుస్సు హానిఁ గలుగఁజేయును; మకరము ధాన్య వృద్ధిని గలుగఁజేయును; కుంభము రత్నములఁ జేకూర్చును; మీనము భయప్రదము. ఇవ్విధము లగు సంక్రాంతి ఫలముల నెఱింగి యిండ్లు గట్టుట మంచిది.

## పక్ష ఫలము

ఆ. శుక్ల పక్షమునను శుభములు చేకూరుఁ
గృష్ణ పక్షమైనఁ గీడుఁ జేయుఁ
బక్షములను రెంటిఁ బరికించి గృహములు
గట్టిరేని సుఖము గలుగు కృష్ణ! 17

శుక్లపక్షమునందు శుభములు గలుగును. కృష్ణపక్షమునఁ గీడు సంభవించును. కాఁబట్టి రెండుపక్షములయందలి ఫలముల నాలోచించి గృహములు కట్టవలయును.

## పక్ష నిర్ణయము

క. ధర శుద్ధతదియ మొదలుగ
సరసంబుగఁ గృష్ణపక్ష సప్తమిదనుకం
గురియగు సితపక్షం బనఁ
బరగుఁ శేషంబు బహుళపక్షము కృష్ణా. 18

శుద్ధతదియ మొదలు బహుళసప్తమివఱకును గల కాలమునకు శుక్లపక్ష మని పేరు. తక్కినది కృష్ణపక్షము. కాఁబట్టి రెండు పక్షములలో శుభకర మగు శుక్లపక్షమున నిండ్లు గట్టవలయును.

## తిథిఫలనిర్ణయము

ఆ. నందతిథులయందు నష్టమౌ నర్థంబు
భద్రతిథులయందు బంధనంబు
దర్శరిక్తలందుఁ దప్పదు మృత్యువు
పూర్ణజయల శుభముఁ బొందుఁ గృష్ణా. 19

ప్రతిపక్షమునను పాడ్యమి, షష్ఠి, ఏకాదశి — ఇవి నంద తిథులు. ఈ తిథులయందు గృహములు గట్టిన ద్రవ్యనాశము గలుగును. విదియ, సప్తమి, ద్వాదశి ఇవి భద్రతిథులు. వీటి యందు గృహారంభమును జేసిన బంధనము కలుగును. చతుర్థి, నవమి, చతుర్దశి అను నీమూఁడును రిక్తతిథులు. ఇవి మృత్యు భయమును గలుగఁజేయును. అమావాస్య ధననాశము గలుగఁ జేయును. తదియ, అష్టమి, త్రయోదశి ఇవి జయతిథులు. ఈ మూఁడును శుభమును గూర్చును. కాఁబట్టి శుభాశుభ తిథి స్వరూపముల నెఱిఁగి యిండ్లుగట్టుట యుత్తమము.

## వారఫలము

తే. అర్కకుజవాసరంబుల నగ్నిభయము
సౌరిని సోమవారంబునం దొరవుగల్గు
సౌమ్యగురుశుక్రవారము లైశ్వర్యములు
శనిదినము తస్కరభయంబు తోయజాక్ష! 20

ఆదివార మంగళవారము లగ్నిభయమును, సోమ వారము చిక్కులను, బుధగురుశుక్రవారములు సౌఖ్యమును, శనివారము చోరభయమును గలుగఁజేయును.

## నక్షత్రఫలము

తే. శతభిషధనిష్ఠపుష్యమిస్వాతిహస్త
చిత్తమృగశీర్షహరియుత్తరాత్రయంబు
మైత్రరేవతిరోహిణుల్ ధాత్రి శుభము
లిండ్లకారంభతారక లివి ముకుంద! 21

శతభిష, ధనిష్ఠ, పుష్యమి, స్వాతి, హస్త, చిత్త, మృగశీర్ష, శ్రవణము, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనూరాధ, రోహిణి, రేవతి అను నీపదునాలుగు నక్షత్రములును గృహారంభమునకు శుభప్రదములు.

## యోగకరణఫలము

సీ. వృద్ధి వర్యాన్నామ సిద్ధి హర్షణశుభ
శోభనబ్రహ్మైంద్ర శుభ్రసిద్ధ
సాధ్యశివప్రీతి సౌభాగ్యధృతి ధ్రువా
యుష్మా న్సుకర్మాది యోగము లివి
పదునెన్మిదియు శుభప్రదములౌ వ్యాఘాత
గండాతిగండ విష్కంభశూల
వజ్రవ్యతీపాత వైధృతి పరిఘము
లశుభంబు లివి తొమ్మి దవనిలోన
బవబాలవకౌలవ తైతిలగరజ వణిజములు
కౌలవాకరణంబు సౌఖ్యప్రదంబు

దూషితంబులు శకునికింస్తుఘ్న భద్ర
నాగవచతుష్పదములు కందర్పజనక ! 22

వృద్ధి, వరీయాన్, సిద్ధి, హర్షణము, శుభము, శోభనము, బ్రహ్మము, ఐంద్రము, శుక్లము, సిద్ధము, సాధ్యము, శివము, ప్రీతి, సౌభాగ్యము, ధృతి, ధ్రువము, ఆయుష్మాన్, సుకర్మము ఈ పదునెనిమిదియును శుభకరణంబు లగును. వ్యాఘాతము, గండము, అతిగండము, విష్కంభము, శూల, వజ్రము, వ్యతీపాతము, వైధృతి, పరిఘ ఈతొమ్మిదియును గీడును గలుగఁ జేయును. బవ, వణిక్కు, తైతిల, బాలవ, గర, కౌలవ ఇయ్యారు యోగములును గృహారంభమున కుత్తమములు. శకుని, కింస్తుఘ్నము, భద్ర, నాగవము, చతుష్పాత్, ఈ యైదును హానికరములు. కావున నివ్విధంబుగ యోగముల యొక్కయు కరణములయొక్కయుఁ దారతమ్యములను దెలిసి గృహమును నిర్మింపఁబూనుట తగును.

**సూర్యచారఫలము**

క. భరణి నొగినుత్తరార్ధము
నెరిఁ గృత్తికయందు రోహిణిన్ పూర్వపదం
బరుదుగ సూర్యుం డుండఁగఁ
గర మరయఁగ నిండ్లు గట్టఁగాదు దహించున్. 23

భరణినక్షత్రముయొక్క మూఁడు నాలుగుపాదముల యందును, కృత్తికానక్షత్రము నాలుగుపాదములయందును, రోహిణీనక్షత్రముయొక్క ప్రథమ ద్వితీయపాదములయందును సూర్యుఁడు సంచరించుచుండ నిండ్లుగట్టుట యుచితముకాదు.

మఱియు నీనక్షత్రములయందుఁ గట్టఁబడినగృహములు కాలి పోవును.

## కుజచారఫలము

తే. అగ్ని పుష్యమి మఘపుబ్బహస్తమూల
రేవతులయందుఁ గుజుఁ డున్న బ్రేమ నిండ్లు
కట్టిరేనియు సుతహాని గలుగునంత
వహ్ని గాల్చును వైశంబు వాసుదేవ. 24

కృత్తిక, పుష్యమి, మఘ, పుబ్బ, హస్త, మూల, రేవతి యను నీయేడునక్షత్రములయందుఁ గుజుఁడు సంచరించుచుండ నిండ్లఁగట్టిరేని సుతహానియు, నగ్నిభయంబును గలుగును.

## కుజచారదోషపరిహారము

తే. నరవి జలరాసులందునఁ జంద్రుఁ డుండి
యతఁడు గురుశుక్రవీక్షితుఁ డయ్యెనేని
ఘనతరోన్నతగృహములు గట్టవచ్చుఁ
గుజుని దోషంబు పనిలేదు నిజము కృష్ణ! 25

పైచెప్పినరీతిఁ గుజుఁడు సంచరించుకాలమున జలరాసుల యందుఁ జంద్రుఁ డుండి యాతఁడు గురుశుక్రులచేఁ జూడఁబడు చుండెనేని కుజచారదోష మేమియు నుండదు. మీనకర్కాట మకరములు పూర్ణజలరాసులు; వృశ్చికతులామేషములు పాద జలరాసులు; ధనుర్మిథునకన్యారాసులు నిర్జలరాసులు. వీనిలోఁ బూర్ణజలరాసులకు యుక్తములగు నక్షత్రములయందుఁ జంద్రుఁ డుండ గురుశుక్రులచేఁ జూడఁబడెనేని కుజదోషము పోవును.

### బుధగురుచారముల ఫలము

సీ. అశ్వినిమృగశీర్ష హస్తోత్తరాచిత్ర
రోహిణి తారల రోహిణేయుఁ
డుండఁగఁ గట్టిన నొగి సుఖధనపుత్ర
పౌత్ర సంపదలచేఁ బ్రబలుచుండు
శ్రవణంబుత్తరాత్రయము పూర్వాషాఢ
మృగశీర్ష సర్పరోహిణుల పుష్య
మిని బృహస్పతియుండఁగను నిండ్లు గట్టినఁ
గలిమి యాయుష్యంబు గలిగియుండు
వీరివాసరముల వీరున్న రాసుల
నుచ్చలందు వీర లుండఁగాను
మందిరములు గట్ట మంచిది జనులకు
వాస్తుశాస్త్రమతము వారిజాక్ష! 26

అశ్విని, మృగశీర్ష, హస్త, ఉత్తర, చిత్త, రోహిణియను నీయారునక్షత్రములయందును బుధుఁడుండఁగను బుధవారము నందును, బుధుఁడు నివసించిన లగ్నమునందును, బుధుని కుచ్ఛస్థానమైన కన్యయందుండఁగను గృహారంభమును జేసిరేని సుఖ ధనపుత్రపౌత్రాదిసంపద గలుగును. శ్రవణము, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పూర్వాషాఢ, మృగశీర్ష, ఆశ్లేష, రోహిణి, పుష్యమియను నీతొమ్మిది నక్షత్రములయందును బృహస్పతియుండు కాలమునందును, బృహస్పతి వాసరమునందును, బృహస్పతియొక్క లగ్నమునందును, బృహస్పతి కుచ్ఛమగురాశి యందును, గృహారంభమును జేయుట మంచిది.

## శుక్ర శని రాహుచారముల ఫలము

సీ. జ్యేష్ఠపునర్వసుచిత్రాశ్వినుఁ ధని
ష్ఠానురాధావిశాఖార్ద్రవరుణ
తారల శుక్రుఁ డెంతయు సంచరింపఁగ
నిండ్లు గట్టిన శుభం బెనయుఁ బతికి
వరుణస్వాత్యుత్తరాభాద్ర పూర్వాభాద్ర
యమధనిష్ఠానురాధామరేశ
తారల శని యున్నతఱి నిండ్లుగట్టిన
యక్షరాక్షసగుహ్యకాళిచేరుఁ
దనర రాహువు నిల్చినతార మొదలు
ఎదిరి తారలు పదునాల్గు మృతము లిట్టి
తారకల నిండ్లు గట్టంగఁ దగ దటంచుఁ
జెప్పి రార్యులు మొదలను శ్రీనివాస! 27

జ్యేష్ఠ, పునర్వసు, చిత్త, అశ్విని, పూర్వాషాఢ, ధనిష్ఠ, అనూరాధ, విశాఖ, ఆర్ద్ర, శతభిషము అను నీ పది నక్షత్రముల యందును శుక్రుఁ డున్నపుడు గృహారంభమునకుఁ బూనిన కర్తకు శుభంబులు గలుగును. శతభిషము, స్వాతి, ఉత్తరాభాద్ర, పూర్వాభాద్ర, భరణి, ధనిష్ఠ, అనూరాధ, జ్యేష్ఠ అను నీ యెనిమిది నక్షత్రములయందు శని సంచరించుచున్నపుడు గృహనిర్మాణము జేసిన యక్షరాక్షసపిశాచాదులు చేరును. రాహువు సంచరించునట్టి నక్షత్రము మొదలుకొని యెదురుగ నుండు పదునాలుగు నక్షత్రములయందు గృహారంభమును జేయరాదు.

## గురుశుక్రాస్తమయాదుల ఫలము

క. గురుశుక్రు లస్తమించినఁ
బరువడి నీచస్థవృద్ధబాలకు లైనన్
విరసప్రుఁదావుల నుండిన
నరిసంయుతులైనఁ బతికి హాని ముకుందా! 28

గురు శుక్రు లిరువురును న స్తమయమును బొందియుం డఁగా వృద్ధులైయున్నను, బాలకులైనను, నీచస్థానములనున్నను శత్రుగ్రహములతోఁ గూడియున్నను గృహారంభమును జేయ రాదు.

## వర్ణేశ్వర ఫలము

క. గృహనాయకజాతిగ్రహ
మహితయుతం బైన న స్తమయ మౌనప్పుడున్
మహి బలరహితుఁడు నౌతటి
గృహములు గట్టినను బరుల కిరవౌఁ గృష్ణా. 29

గృహయజమానుఁ డేజాతిపురుషుఁడో యాజాతిగ్రహము శత్రువుతోఁ గూడినను, అ స్తమయమును బొందినను, నీచస్థానము బొందినను ఆసమయముల గృహములను గట్టరాదు.

## లగ్న ఫలము

క. స్థిరలగ్నము లుత్తమములు
చరములువెస మధ్యమములు చర్చింపంగా
ధరయందు ద్విస్వభావము
లరయ నిషిద్ధంబులందు రాశ్యలు కృష్ణా! 30

గృహనిర్మాణమునకు స్థిరలగ్నము లుత్తమములు, చర లగ్నములు మధ్యమములు, ద్విస్వభావ లగ్నములు నిషిద్ధ

ములు, వృషభసింహావృశ్చికకుంభములు స్థిరలగ్నములు, మేష కర్కాటక తులామకరములు చరలగ్నములు, మిథునకన్యా ధను ర్మీనంబులు ద్విస్వభావములు.

## లగ్నగతగ్రహఫలము

క. అరిగృహమునందుఁ బదిటను
గిరిసంఖ్యను గ్రహము లున్న గృహములఁగట్టన్
బరులకుఁ జేపడు నిజముగఁ
బరగఁగ నారంభలగ్నఫల మిది కృష్ణా! 31

గృహారంభలగ్నమునకు నాఱవ యింటియందును, పదియవ యింటియందును ఏడవ యింటియందును గ్రహములుండిన గృహారంభమునకుఁ బూనరాదు. ఒకవేళ నెవరేని యట్లు పూనిన నాగృహము పరులపా లగును.

## దిగాయరాశివిరోధములవ ఫలము

సీ. ప్రాగ్దిశాధ్వజములు పగవృశ్చికమునకు
జ్వలనదిగ్ధూమముల్ ఝషకు రిపులు
శమనదిక్సింహముల్ శత్రువు ల్కన్యకుఁ
గడుదైత్యదిక్శునుల్ కర్కియరులు
వరుణదిగ్వృషభముల్ విరసము ల్వింటికిఁ
బవనదిక్ఖరములు పడవు తులకు
ధనదదిగ్గజములు తగవు మేషమునకు
శంభుదిక్కాకము ల్కుంభవైరు
లవును మకరంబు మిథునంబు హరియు వృషము
మధ్యమున నిల్పి రేనియు మడిసిపోవు

గావున దిగాయరాసులక్రమ మెఱింగి
యిండ్లుగట్టిన శుభములు నెసఁగుఁ గృష్ణ. 32

తూర్పుదిక్కు ధ్వజాయము, వృశ్చికరాశివారికిఁ బనికి రాదు. ఆగ్నేయదిక్కు ధ్వజాయము, మీనరాశివారికిఁ బనికి రాదు. దక్షిణపుదిక్కు సింహాయము, కన్యారాశివారికిఁ దగదు. నైరృతిదిక్కు శ్వానాయము, కర్కటరాశివారి కనుకూలము కాదు. పడమటిదిక్కు వృషభాయము, ధనుర్లగ్నమువారికిఁ బనికిరాదు. వాయవ్యదిక్కు ఖరాయము, తులాలగ్నమువారి కనుకూలముకాదు. ఉత్తరదిక్కు గజాయము, మేషరాశివారికిఁ బనికిరాదు. ఈశాన్యము కాకాయము, కుంభరాశివారికిఁ గూడదు. మకరమిథునసింహావృషభరాసులవారు గ్రామమధ్యంబు నందు గృహంబులను గట్టరాదు. కావున నివ్విధముగఁ దెలియక గృహనిర్మాణమును జేసిరేని యనేకములగు ననర్థములకుఁ బాత్రు లగుదురు.

## వర్గారూఢము

సీ. అకచటతపయశ లష్టవర్గంబులు
ప్రాగాదిదిశలను బరఁగు నందు
గరుడమార్జాలకకంఠీరవశ్వాన
సర్పమూషకగజశశములుండు
అధిపవర్గంబున కహితంబు పంచమ
వర్గంబు శేషంబు వరశుభంబు
అధికవర్గంబు దా నల్పవర్గువు మీఁద
నుండినఁ గర్తకు నుచితమగును

అధిక వర్గస్థలంబుల నల్పవర్గ
మున్నచో హాని యగు నందు రుర్వియందు
శత్రుమిత్రాప్యణంబుల జాడ లెఱిఁగి
యిండ్లుగట్టిన శుభముల నెసఁగుఁ గృష్ణ. 33

అ ఆ ఇ ఈ ఉ ఊ లు అవర్గము. ఈయవర్గము తూర్పున నుండును. దీని కధిపతి గరుత్మంతుఁడు. క ఖ గ ఘ ఙ లు కవర్గము. ఈ కవర్గ మాగ్నేయమున నుండును. దీని కధిపతి మార్జాలము. చ ఛ జ ఝ ఞ లు చవర్గము. ఇది దక్షిణమున నుండును. దీని కధిపతి సింహము. ట ఠ డ ఢ ణ లు టవర్గము. ఇది నైరృతి దిక్కున నుండును. దీని కధిపతి శునకము. త థ ద ధ న లు తవర్గము. ఇది పశ్చిమమున నుండును. దీని కధిపతి సర్పము. ప ఫ బ భ మ లు పవర్గము. ఇది వాయవ్యదిక్కున నుండును. దీని కధిపతి యెలుక. య ర ల వ లు యవర్గము. ఇది యుత్తరమున నుండును. దీని కధిపతి యేనుఁగు. శ ష స హ లు శవర్గము. ఇది యీశాన్యమున నుండును. దీని కధిపతి కుందేలు. ఈ యెనిమిదివర్గములలోఁ బ్రతివర్గమునకు నైదవవర్గము శత్రుస్థానము. కాఁబట్టి తన నామధేయమునందలి మొదటియక్షర మేవర్గమునందుండునో చూచుకొని యావర్గమునకు శత్రువర్గమునందు గృహారంభమును జేయరాదు. అధికవర్గంబుగలవార లల్పవర్గంబుగలచోట్ల నిండ్లఁగట్టరాదు. అనఁగా గరుడవర్గమువారు సర్పవర్గముగలచోట నిండ్లఁ గట్టవచ్చును. ఇవ్విధంబుగ నధికాల్పంబులను విచారింపవలయును. అల్పవర్గముగలవారు అధికవర్గముగలచోట నిండ్లఁగట్టరాదు. అనఁగా సర్పవర్గము

వారు గరుడవర్గము గలచోట నిండ్ల గట్టరాదు. యుక్తాయుక్తముల నెఱిఁగి యిండ్లుగట్టినవారు సుఖవంతు లగుదురు.

సీ. అరయంగ సాధ్యనామాద్యక్షరమువర్గ
సంఖ్యదాఁగుడిదెశ సరవి నిల్పి
వరసాధకాఖ్యాది వర్ణవర్గపు సంఖ్య
వామభాగంబునఁ బ్రేమ నిల్పి
గజభాగశేషంబు గణుతింప ధనమగు
తద్వ్యత్యయంబైనఁ దనరు ఋణము
ధనమెక్కుడైయున్న ధనవంతుఁ డైయుండు
ఋణమెక్కుడైయున్న ఋణముఁ జేయు
ధనఋణంబులు సమమైనఁ దగునుసమత
యశము నశియించు వైరాఖ్య మూర్తిఁ జేయు
మూఢబుద్ధిని సద్మము ల్మానసికట్ట
గాదు గావున నిదియె మర్యాద కృష్ణ! 34

ఒకఁడు వచ్చి 'నే నీదిక్కున నింటిని గట్టవచ్చునా' అని యడుగ ననుకొనుఁడు. అడుగువానికి అభీష్టమైనదిక్కు 'అకచటతపయశ' వర్గములలో నెన్నవవర్గమగునో యా సంఖ్యను కుడిభాగమున నుంచి పిదప ప్రష్టయొక్క నామాద్యక్షర మెన్నవవర్గయందుండునో యాసంఖ్యను ఎడమభాగమున నుంచి యామొత్తమును ఎనిమిదితో భాగించఁగా మిగిలినసంఖ్య ధనమని యెఱుఁగవలయును. తొలుతటిసంఖ్యల నెడమదిక్కున నున్న సంఖ్యను గుడిప్రక్కను, కుడిప్రక్కనున్నసంఖ్య నెడమ ప్రక్కను బెట్టి యామొత్తమును ఎనిమిదితో భాగించగా మిగిలినసంఖ్య ఋణ మని యెఱుఁగవలయును. ఇట్లు ధనఋణ

ములను రెంటిని దెలిసి ఋణముకంటె ధన మెక్కువయ్యెనేని యాదిక్కున గృహమును గట్టవచ్చును. ఋణ మెక్కువై ధనము తక్కువైనదిక్కున నిల్లుగట్టరాదు. ధనఋణములు రెండును సమముగ నుండుదిక్కున గృహమును గట్టుటవలన దోషము లేకపోయినను లాభములేదు. మఱియుఁ గర్తయొక్క నామాద్యక్షరమునకు నైదవవర్గము శత్రువర్గము గావున నట్టి శత్రువర్గస్థలమున గృహమును గట్టఁదగదు. గురుమూర్తియను నతఁ డుత్తరదిక్కున నిల్లుగట్టవచ్చునా యని యడుగు నను కొనుఁడు. ఉత్తరదిక్కుననుండువర్గము యవర్గము. ఆవర్గ మేడవది. కర్తయొక్క నామాద్యక్షరము కవర్గములోనిది. ఆవర్గము రెండవది. 'అంకానాం వామతో గతిః' అను నియమము ననుసరించి యాసంఖ్య యిరువదియేడయ్యె. ఆసంఖ్య నెనిమిదితో భాగింపఁగా మిగిలినది మూఁడు. కావున ధనసంఖ్య మూఁడు. తొలుతటిసంఖ్యనే తలక్రిందుగఁ జేసిన డెబ్బదిరెం డగును. ఈసంఖ్య నెనిమిదితో భాగింపగా మిగిలిన దేమియు లేనందున ఋణము లేదు. కావున గురుమూర్తి యనునతనికి ఉత్తరదిక్కున ఋణము లేక ధనముమాత్ర మధికమైయుండుటచే నాదిక్కు గృహనిర్మాణమున కుచితమైయున్నది.

## నామరాశినిజూచులక్షణము

సీ. షోడశచక్రంబు సురుచిరంబుగ వ్రాసి
నడిమి నాల్గిండ్లు బోవిడిచి మొదల
నీశాన్యమున మీన మీరీతిఁ గ్రమముదీ
ర్ణత రాసులు ప్రదక్షిణముగ వ్రాసి

యందు శాలలుగట్టి నగుఫలం బొక్కటిరై
దును దొమ్మిదియు బంధుజనులఁ బ్రోచు
పురగిరిరుద్రులఁ బోషింత్రు పరులను
రెంట నాఱింటఁ బదింటహాని
నాలు గెనిమిది పండ్రెండు నాశనంబు
గాన కర్త రాశ్యాదిగా గణనజేసి
యిండ్లుకట్టిన శుభములు నెనయు నండ్రు
వాస్తుసిద్ధాంతవేత్తలు వారిజాక్ష. 35

నిలువుగ నైదుగీట్లను నడ్డముగ నైదుగీట్లను గీచిన పదునారిండ్లగును. ఇదియే షోడశచక్రము. ఈచక్రమునందు నడిమి నాలుగిండ్లను విడిచి యీశాన్యము మొదలుచేసికొని మీనాదిగాఁ బండ్రెండు రాసులను బ్రదక్షిణక్రమమున వ్రాసి కర్తయొక్క నామరాశికి గృహారంభమునకు నిర్ణయింపఁబడిన స్థలముయొక్కరాశి యెన్నవదగునో యెంచవలయును. అట్లు లెక్కించఁగా నొకటి, ఐదు, తొమ్మిది రాసులుగలచోటులయందు గృహారంభమును జేయువాఁడు బంధుజనులను బోషించువాఁడగును. కర్తయొక్క రాశికి మూఁడు, ఏఁడు, పదునొకండు రాసులఁగలచోటుల గృహారంభమును జేసిన బరులచేఁ బోషితుఁడగును. కర్తయొక్క రాశికి రెండు, ఆఱు, పది రాసులుగలచోట్ల నిల్లుగట్టిన హానిని బొందును. కర్తయొక్క రాశికి నాలుగు, ఎనిమిది, పండ్రెండుస్థానములు నాశకరము కావున నీవిధముగ నామరాశికిని గృహారంభమును జేయ నిశ్చయించిన స్థలము రాశికిని అచ్చుపలను జూచి యిండ్లుగట్టుట యుత్తమము.

క. కత్తెర ముమ్మూలకునుల్
వృత్తముపణవాకృతియును వీధినిరోధా
యత్తము విషమాస్రంబగు
నెత్తము నిలయములు గట్ట నింద్యములు హరీ. 36

కత్తెరగలదియు, మూడుమూలలు మాత్రము గలదియు, వలయాకారమైనదియు, మద్దెలవలె నున్నదియు, వీథుల యడ్డగింపు గలదియు, విషమచతురస్రము నగు భూమియందు గృహముల నిర్మింపఁ జనదు.

వ. మఱియును. 37

సీ. ఊసరభూమిని నూరికి నడుమను
గోణదేశంబుల గుంటపట్ల
నీరు పాఱెడుచోట నింపితం బగుతావు
పసగఁగ గుడినీడ పారునేలఁ
బుట్టఁబెట్టినచోటఁ దిట్టు బొందెడుచోట
గోగణంబులు మందగూడుచోటఁ
దగ్గైన వరుణార్కతనయుల దెసలును
బిలసమీపములను బ్రేతభూమి
తేనె నెయ్యి పెఱుగు నూనె నెత్తురు మీను
శవము పిట్టకంపు లవణరసము
తగదు ఇండ్లుకట్టఁ దథ్యంబు నరులకు
వాస్తుశాస్త్రమతము వాసుదేవ! 38

ఊషరక్షేత్రము, గ్రామమధ్యప్రదేశము, గ్రామము యొక్క మూలల గుంటగల ప్రదేశము, నీరు పాఱెడుస్థలము, పదుగురు నిందించెడు తావు, దేవాలయపు నీడపారు ప్రదేశము,

పుట్టలు గలచోటు, పదుగురచేఁ దిట్టుపడినభూమి, పశువులు మందచేరునట్టి చోటు, పశ్చిమ దక్షిణముల తక్కువగు స్థలము, బిలసమీపప్రదేశము, శ్మశానము, తేనె, నెయ్యి, పెరుఁగు, నూనె, నెత్తురు, మీను, శవము, పిట్టలు—వీని వాసనగలచోటు, ఉప్పునేల ఈ ప్రదేశములందు గృహములను గట్టఁదగదు.

## గ్రాహ్యక్షేత్ర రసగంధస్వరూపము

సీ. మహి శుభ్రవర్ణంబు మధురరసంబును
పద్మసుగంధంబు బ్రాహ్మణులకు
రక్తవర్ణపు భూమి రసము కాషాయంబు
హస్త్యశ్వవాసన యవనిపతుల
కవసిపచ్చనివర్ణ మామ్లరసంబును
పశుధాన్యగంధంబు వైశ్యులకును
క్షితినీలవర్ణంబు చేదుకారపు రసం
బాసవ పరిమళం బంఘ్రిజులకు
శబలవర్ణమైన సంకరంబుల కగు
మధురరసము తావి మంచిదగును
సస్యములు ఫలించు సర్వాంసహాస్థలి
సకల జాతిజులకు సౌఖ్య మభవ! 39

తెల్లనివర్ణమును, తియ్యనిరుచియును, తామరపుష్పముల వాసనయును గలప్రదేశము బ్రాహ్మణులు గృహనిర్మాణము జేయ ననువైనది. ఎఱుపు రంగును, వగరురుచియును, హస్త్యశ్వముల వాసనయును గలతావు క్షత్రియులకు తగినది. పచ్చని వర్ణమును, పుల్లని రసమును, పశువులయో - ధాన్యములయో వాసనయును గలచోటు వైశ్యులు గృహనిర్మాణము చేయఁ

దగినది. నల్లనిరంగును, చేదు కారములరుచియును, కల్లు వాసనయును గలభూమి శూద్రులిండ్లుగట్టఁదగినది. చిత్రవర్ణమును, మధురరసమును గలప్రదేశము సంకరజాతివారిండ్లుగట్ట యోగ్యమైనది. మధురరసమును, సువాసనయుఁ గలిగిన సస్యములు ఫలించు ప్రదేశమెల్లవారలకుఁ దగినది.

భూప్రార్థన

శ్లో. అస్మిన్ వస్తు వివర్ధస్వ ధనధాన్యాదిమేదిని,
ఉత్తమం వీర్యమాస్థాయ నమస్తే తుష్టిదా భవ. 40

బలివిధి

దేవతాభ్యః పితృభ్యోఽథ భూతేభ్యస్సహజంతుభిః,
ఏతత్థానవివాసిభ్యః ప్రయచ్ఛామి బలిం నమః. 41

భూతోచ్చాటనము

అముకస్యకరిష్యేఽత్ర వేశ్మయుష్మదనుజ్ఞయా,
అపసర్పంతు యేయత్ర స్థానమన్యద్గతానమః. 42

పల్లమున మృజ్జలముల నిండించువిధము; ఫలము

సీ. నిలయాధిపుని మూరఁగొలిచి చౌకంబుగా
నంతియలోఁతుగా నచటఁ ద్రవ్వి
యామట్టిపూరింప నది కొంతమిగిలిన
ముదమునసంపదల్ పొదలు నెపుడు
సరిపోయినట్లైన సమఫలం బగునండ్రు
వెలితియై యుండినఁ గలిమి జెఱచు
హరిదశ్వుఁ డస్తాద్రి కనుగమించినవేళ
నట్టిఖాతంబులో నంబు లెలమి

నించి సూర్యోదయంబున నెమ్మి జూడఁ
గొన్ని యుండిన నడుసైనఁ గూర్చు శుభము
పదును లేకున్న నెఱెయలు వారియున్నఁ
దగని దాభూమి యిండ్లకు దానవారి. 43

గృహపతియొక్క మూరతో నలుచదరముగ మూరెఁ డుండునట్లు కొలిచి త్రవ్వి మరల నామట్టిచే గుంటను బూడ్వ వలయును. అట్లు పూడ్వగాఁ దొలుతటిమన్ను మిగిలిన శుభము. సరిపోయెనేని సమఫలము. చాలకపోయెనేని దారిద్ర్యముగలు గును. ఈగుంటయందు సూర్యాస్తమయమున నది నిండునటులు ఉదకమునుబోసి మరునాఁటి సూర్యోదయమునఁ జూడవలయును. అప్పటి కాగుంటయందు జలముండినను, బురదబురదగా నుండి నను శుభము గలుగును. పదును లేకుండ నెఱ్ఱెలు వారియుండె నేని యాభూమియందు గృహమును గట్టరాదు.

జలావర్తలక్షణము

తే. నీళ్లుపాలును గుంటలో నించునపుడు
సరవిని బ్రదక్షిణంబుగాఁ దిరిగెనేని
కామధేనువురీతి నాభూమికర్త
కీప్సితార్థంబు లొనగూర్చు నింది రేశ! 44

నీళ్లను, పాలను బోయునపుడు గుంటలో ప్రదక్షిణ ముగఁ దిరిగెనేని యాప్రదేశము కామధేనువువలెఁ గర్తకు నానావిధములయిన శుభములను గలుగఁజేయును.

హస్తపరిమాణము

సీ. అడ్డంబుగా యవ లాఱు దొంతిగ నిడ
నంగుళం బగునట్టి యంగుళములు

ముప్పదిరెండైన మొగిఁగిష్కు వనఁదగు
నది ప్రాకృతులయిండ్లఁ గట్టఁ గొల్వ
ముప్పదినాల్గయిన మొనయుఁ బ్రాజాపత్య
మది వైశ్య శూద్రుల సదనములకు
ముప్ప దాఱింటను జొప్పడు ధను వన
నది బ్రాహ్మణ క్షత్రియాభిమతము
ముప్ప దెనిమిదింట నొప్పు ధనుర్గ్రహ
మది సురాలయమున కమరుఁ గొల్వ
గణనఁజేసి హస్తకమ్ముల కీరీతి
నిశ్చయంబు శాస్త్ర నియతి కృష్ణ. 45

అడ్డముగ నారుయవలను దొంతిగ నిడిన నెంత పొడ వగునో యది అంగుళ మనిపించుకొనును. అట్టి యంగుళములు ముప్పదిరెం డయ్యెనేని యది కిష్కు వను సంజ్ఞగల హస్త మగును. అట్టి కిష్కు హస్తంబుచేఁ బ్రాకృతుల గృహములఁ గట్ట వచ్చును. ముప్పదినాలు గంగుళము లయ్యెనేని ప్రాజాపత్య మగును. దానిచే వైశ్యులయొక్కయు శూద్రులయొక్కయు నిండ్లను గట్టవచ్చును. ముప్పదియాఱంగుళము లయ్యెనేని ధను వగును. అది బ్రాహ్మణులయొక్కయు క్షత్రియులయొక్కయు నిండ్లను గట్ట ననువగును. ముప్పదియెనిమి దంగుళము లయ్యెనేని ధనుర్గ్రహ మగును. దీనిచే దేవాలయాదులను గొలువవలయును.

సీ. అడ్డ మెన్మిది యవ లలరిన నంగుళం
బంగుళాల్పంద్రెండు నదివితస్తి

నవి రెండు హస్తమా నట మూఁడు వ్రీహుల
పొడ వంగుళం బని నుడువ నదియు
మానాంగుళం బగు మనుజుని నడివేలి
మధ్యమాంగుళిపర్వమధ్యమందు
మాత్రాంగుళం బగుమరి యవి యిరువది
నాల్గైన హస్త మనం జెలంగు
నిట్టి హస్తంబులను భూమి నెలమిఁ గొలిచి
పొడవు వెలుపు గుణింప నేర్పడుపదంబు
అఖిలజాతుల కిదియ మర్యాదసుమ్ము
వాస్తుసిద్ధాంతమత మిది వారిజాక్ష. 46

అడ్డముగ నెనిమిది యవలు దొంతిగఁ బెట్టిన నయ్యేడు పొడవు అంగుళమగును. ఆయంగుళములు పండ్రెండయిన వితస్తి యగును. రెండు వితస్తు లొక హస్తమగును. మూఁడు సన్నని వడ్లగింజలను నిలువుగఁ బెట్టిన నయ్యేడు పొడవొక యంగుళము. ఇది మానాంగుళ ప్రమాణము. ఇట్టి హస్తముచే నిండ్లఁ గొలువ వలయును. మనుజుని నడివేలి మధ్యమాంగుళిపర్వమధ్యమున గల యంతర మొక మాత్రాంగుళము. అట్టి యంగుళము లిరువది నాలుగయిన నొక హస్త మగును. వివిధప్రమాణములుగల యీ హస్తములతో భూమి నిడివి వెడలుపులను గొలిచి యాసంఖ్యల నొండొంటఁ బెంచిన వచ్చు మొత్తము పద మనఁబడును.

క. ధరణీసురులకు రాజుల
కరుదందగ వేణుదండమగు వైశ్యులకుఁ

చరణప్రభవాదులకుఁ
దిరిసెనపూవంద మమరుఁ దెలియఁగఁ గృష్ణా! 47

బ్రాహ్మణక్షత్రియులగృహములు వెదురుగడతోఁ గొలువవలెను. వైశ్యులయొక్కయు శూద్రాదులయొక్కయు గృహములు దిరిసెనపు వందముతోఁ గొలువవలెను.

తే. కూర్మి యాగోపకరణముల్ గొలుచునపుడు
జగతి మాత్రాంగుళంబు ప్రశస్త మయ్యె
నితర మగునట్టి క్రియలందు నెలమి గొలువఁ
దనరు మానాంగుళంబు ప్రధాన మగుచు. 48

యజ్ఞశాలలను గొలుచుటకు మాత్రాంగుళహస్తము ప్రశస్తము. తక్కిన క్రియలకు మానాంగుళహస్తము ప్రశస్తము.

## ప్రాక్సాధనశంకులక్షణము

తే. వసుధఁ బ్రాక్సాధనపు శంకు వట్రు వగుచు
నమరు విస్తార మైదంగుళములు మొదల
నగ్ర మేకాంగుళాయత మలరుఁ బొడవు
పదియు రెం డంగుళంబుల విదిత మభవ! 49

ప్రాక్సాధనముసు జేయుటకొఱకుఁ దగినదారువును దెచ్చి మొదట నైదంగుళముల విస్తారమును, కొన నొక యంగుళము విస్తారమును, పండ్రెండంగుళములు పొడవుగు నుండునట్లు వట్రువుగాఁ జేయవలెను.

## ప్రాచీసాధనము

సీ. తనకుఁ గావలసిన ధరణీస్థలంబును
జదరంబుగాఁ జేసి శంకుపొడవు

సూత్రంబుచేతను సారిదివృత్తముఁ జుట్టి
తన్మధ్యమంబగు ధరణి శంకు
నిలిపి రేపటివేళ సలశంకుకొన నీడ
వృత్తరేఖను సోఁక వేగ నచట
బిందువు నిలిపి పెం పొంద మాపటివేళఁ
దగశంక నీడ వృత్తమునసోఁక
బిందువుబెట్టి తద్బిందు ద్వయం బంటఁ
జక్కఁగా సూత్రంబు జాపి నపుడు
ప్రాక్పశ్చిమములగుఁ బ్రాక్పశ్చిమంబుల
బిందువుల్ నడుమఁగా నొందనొకటి
నొక్కటిలోఁ జేర నొగివృత్తముల్ జుట్ట
మత్స్యంబుపుట్టుఁ దన్మధ్యమునను
మత్స్యపుచ్ఛాస్యసమంబు గా వృత్తరే
ఖను సోఁక సూత్రంబుఁ జొనిపి యచట
గురుతు లుంచిన దక్షిణోత్తరము లయ్యె
వెలయు నచ్చట వృత్తముల్ విసరి నపుడు
మూల లేర్పడు నీరీతి మొదలదిక్కు
లెఱుఁగ కిలుగట్టు టేలాగు ధరణిఁ గృష్ణ! 50

గృహమును గట్టఁదలఁచిన భూమియందు మిట్టపల్లములు లేకుండునట్లు చదరముచేసి ప్రాచీసాధనపు శంకును నిలిపి అది నాటినగురుతు కానవచ్చును. ఆగురుతున సన్నపాటిమేకు దించి దానికి శంకెంతపొడవో అంతపొడవుసూత్ర ముండునట్టుగాఁ గట్టి వలయాకారముగఁ జుట్టిన నది శంకు విగణితావృత మని పించుకొనును. అంత నానాటిన మేకుఁదీసి యాగురుతున ప్రాచీ

సాధనశంకును నిలిపి రేపటివేళ నాశంకుకొన నీడ వృత్తరేఖపయి నెక్కడ సోఁకునో అచ్చట గుఱుతుగా బిందువుఁబెట్టి, మాపటి వేళ శంకునీడ వృత్తరేఖ యెక్కడ సోఁకునో అచ్చట గురుతుగా నింకొక బిందువుఁబెట్టి యా రెండు బిందువులకు సూత్రమును జక్కఁగాఁబట్టిన నాసూత్రము తూర్పు పడమరల కుండును. ఆ తూర్పు పడమరల బిందువులు నడుమనుండునట్లుగా వృత్తములఁ జుట్టిన మొదట వృత్తములలో మత్స్యరేఖ పుట్టును. ఆమత్స్య ముఖపుచ్ఛములఁ జక్కఁగా వృత్తరేఖను సోఁకునట్లుగా సూత్ర మునుబట్టి యక్కడ బిందువు లుంచవలెను. అవి గల చోటులు దక్షిణోత్తరము లగును. ఆ దక్షిణోత్తర బిందువులు నడుమనుండ వృత్తములఁ జుట్టిన నాలుగుమూల లేర్పడును. ఈవిధముగాఁ బ్రాగ్దిక్కును (తూరుపుదిశను) సాధించి యిండ్లు గట్టినయెడల సకల శుభములును చేకూరును.

## సూత్ర లక్షణము

తే. దర్భసూత్రంబు ద్విజులకుఁ దగును నారి
కేళసూత్రంబు నృపులకు లీలఁ దనరు
వైశ్యులకుఁ దాళసూత్రంబు వసతియగును
శూద్రజాతికిఁ గార్పాససూత్ర మభవ ! 51

బ్రాహ్మణులకు దర్భతోఁ జేసిన సూత్రము శ్రేయస్కరము. క్షత్రియులకు నారికేళసూత్రము శుభప్రదము. వైశ్యులకుఁ దాళసూత్ర ముత్తమము. శూద్రులకుఁ గార్పాససూత్రము క్షేమప్రదము.

క. ముడిలేకను వెలికొన లా
వడరఁగ ముప్పురిని బెనఁచ నగుసూత్రము చొ

ప్పడు దేవద్విజనృపులకు
వడి నిరువురి సూత్ర మితరవర్ణముల కగున్. 52

ముడిబడకుండునట్లు ముప్పిరిఁబెట్టిన త్రాడుయొక్క వెలి కొన లావుగ నుండవలయును. అట్టి త్రాటిచే దేవాలయములను బ్రహ్మక్షత్రియ గృహములను కొలువవలయును. రెండు పేటలు గల త్రాటిచే వైశ్యశూద్రుల గృహములను కొలువవలయును.

## శంకుసూత్ర లక్షణము

తే. పిడికెఁడు వలంబు మూరెఁడు పొడవు శంకు
మొదలు కొనఁజేసి డాకేలి ముష్టిఁ బట్టి
యష్టవారము ల్వాలకేడియష్టిచేత
ఘట్టనము ప్రాఙ్ముఖోదఙ్ముఖముల వలయు. 53

సారము గలిగి పిడికెఁడు లావు మూరెఁడు పొడవు గలిగిన కొయ్యలను దెచ్చి, మొదలు లావుగను, కొన సన్నముగను నుండునట్లు చెక్కి వాని నెడమచేతఁ బట్టి, కొయ్యగూటమును కుడిచేతఁ బట్టి, తూరుపునకుఁగాని ఉత్తరమునకుఁగాని ముఖ ముండునట్లు కూరుచుండి శంకుసూత్రముపైన నెనిమిది మూలల నుంచి కుడిచేతిగూటముతోఁ గొట్టవలెను.

## సూత్రమునుబట్టు లక్షణము

క. భిత్తికి లోనగు నిండ్లకు
భిత్తికి వెలి దేవతలకు భిత్తికి నడుమన్
హత్తును ప్రాకారంబున
కిత్తెఱఁగున సూత్రనియతు లెసఁగును గృష్ణా! 54

గృహములకు గోడలకులోపల సూత్రమునుబట్టవలయును. దేవాలయములకు గోడలకు వెలుపలఁ బట్టవలయును. ప్రాకారములకు గోడల నడుమఁబట్టవలయును.

శంకుభంగసూత్రత్రుటనఫలము

సీ. ఆగ్నేయదిశశంకు నంతకుదిశనూలు
భగ్నమై తెగినను బతికి హాని
సురవైరిదిశశంకు పడమటిదిశనూలు
భగ్నమైతెగినను బత్ని నొచ్చు
పవమానుదిశశంకు పౌలస్త్యదిశనూలు
భగ్నమై తెగినను బ్రజకు నష్టి
పురహరుదిశశంకు పురుహూతుదిశనూలు
భగ్నమై తెగినను బ్రాణభీతి
యగును దక్షుసకు నటమీఁదిమూలల
సూత్రములు తెగినను శోకభయము
గలుగు దంపతులకుఁ దెలియఁగావలయు నీ
కరణి వాస్తుశాస్త్రగతులు కృష్ణ! 55

ఆగ్నేయదిశయందు శంకువును నాటునపుడు శంకువు విరిగినను దక్షిణదిశయందు సూత్రము బట్టునపుడు సూత్రము తెగినను గృహపతికి హాని గలుగును. నిరృతిమూలయందు శంకువు విరిగినను, పడమటిదిశయందు సూత్రము తెగినను గృహపతి భార్యకుఁ గీడు మూఁడును. వాయవ్యదిశయందు శంకువు విరిగినను, కుబేరదిశయందు సూత్రము తెగినను గృహపతి సంతానము నశించును. ఈశాన్యమున శంకువు విరిగినను, తూర్పున సూత్రము తెగినను వడ్రంగికిఁ బ్రాణహాని కలుగును.

మూలలయందు సూత్రము బట్టునపు డది తెగనేని దంపతులకు శోకభయములు గలుగును.

శల్య పరీక్ష

తే. వర్గశుద్ధిగ సూత్రముఁ బట్టునపుడు
సూత్ర మేజంతువులు దాఁటు నోరిచె నచట
మహిని ద్రవ్విన మనుజప్రమాణముకను
వానిశల్యము లుండు నవశ్యముగను. 56

వర్గశుద్ధిగ సూత్రమును బట్టునపు డాసూత్రము నేచోట నేజంతువు దాఁటునో యాచోట మనుజుని లోఁతునఁ ద్రవ్వ నా జంతువు శల్యములు గానవచ్చును.

సీ. గోనకోని సూత్రంబు కోడిదాఁటినఁ దూర్పు
దెస బక్షిశల్యముల్ దేటపడును;
పిల్లిదాఁటినఁ గానుపించుఁ దచ్ఛల్యంబు
లాగ్నేయమునఁ; బులాయంబు దాఁట
శమనునిదెస మహిషంబుశల్యము లుండు;
శునిదాఁట నైరృతి మనికియందు
వానిశల్యము లుండు; వడి వృషభంబు దాఁ
టిన వానియెమ్ము లుండును జలేశు
కడను; రాసభము సంగతి దాఁట దానియె
మ్ములు వాయుదెస నుండు; మొనసి హయము
దాఁటఁ దచ్ఛల్యముల్ ధనదుదిక్కున నుండు;
కాకి దాఁటిన శశకమ్ము నెమ్ము
లీశాన్యమున నుండు; నెలమితో మనుజుండు
దాఁటిన మధ్యమస్థానమునను

మనుజులయెమ్ములు గనుపించు సభ్యకర్త;
డట వచ్చి యేదిక్కు నరసిచూచు
నచట డెబ్బదిమూఁడు మాత్రాంగుళముల
లోఁతున మనుష్యశల్యముల్ దూఁచు; వెఱ్ఱి
వాఁ డటకు వచ్చి నిలుచుండి చూడ మాన
వాస్థు లుండు నశీత్యంగుళాంతరమున. 57

గృహమునకు సూత్రమును బట్టునపుడు ఆసూత్రమును కోడిదాఁటినయెడల తూర్పునఁ బక్షిశల్యము లుండును. పిల్లి దాఁటిన నాగ్నేయమునఁ బిల్లియెముక లుండును. ఎనుపోతు దాఁటిన దక్షిణమున నెనుపోతు శల్యము లుండును. కుక్క దాఁటిన దాని యెమ్ములు నిర్ృతిదిక్కున నుండును. వృషభము దాఁటిన పడమటిదిశయందు వృషభశల్యము లుండును. గార్దభము దాఁటినయెడల వానియెమ్ములు వాయవ్యదిశ నుండును. గుఱ్ఱముదాఁటిన నుత్తరమున దాని శల్యము లుండును. కాకి దాఁటినయెడల నీశాన్యమునఁ గుందేటియెముక లుండును. మనుష్యుఁడు దాఁటిన మధ్యమస్థానమున మనుజుని శల్యము లుండును. తలయంటుకొనిన వాఁడు వచ్చి యే దెసఁజూచునో ఆ దెస మానవ శల్యములు డెబ్బదిమూఁడు మాత్రాంగుళముల లోఁతున నుండును. వెఱ్ఱివాఁడువచ్చి యెటనిలుచుండిచూచినను మానవ శల్యము లెనుబదియంగుళములలోఁతున నుండును.

## వర్ణాక్షర ప్రశ్నఫలము

సీ. సూత్రంబుపట్టెడుచోటికి నెవరైన
వచ్చి యవర్ణువు నుచ్చరించి

ప్రశ్నచేసిన నింద్రు పదమున నిలువున
గజపక్షిశల్యముల్ గానుపించు
నలిఁ గవర్గోచ్చారణప్రశ్న నాగ్నేయ
మునఁ జేతెఁడెద మేషమూషకాది
శల్యంబు లుండు; నెంచఁగ జవర్గోచ్చార
ణాప్రశ్నచే దక్షిణమున హస్త
మాత్రాంతరంబున మహిష శల్యము లుండు;
ధృతిఁ డవర్గువు నుచ్చరించు ప్రశ్న
నసురకోణంబున హస్త మాత్రంబున
శునక నరాస్థులు సొరిది నుండు;
దగదవర్గోచ్చారిత ప్రశ్నచేఁ బశ్చి
మమున హస్తద్వయ మాత్రమునను
సర్పనక్రంబుల శల్యంబు లుండును;
రహిఁ బవర్గాక్షర ప్రశ్నచేత
మారుతదిశ హస్త మాత్రాంతరమున మూ
షకకురంగాస్థులు సరవి నుండు;
రమణ యవర్గాక్షర ప్రశ్నచేత ను
త్తరమున నిలువున గరితురంగ
శల్యంబు లుండుఁ; గొంచక శవర్గాక్షర
ప్రశ్న నీశునిదెస బాహు మాత్ర
గర్తాంతరముననుఁ గనుపించు శశవృక్ష
శల్యముల్; వర్గాంత సమితి నుచ్చ
రించు ప్రశ్నను దగఁ బరికించ నెచట
శల్యములు లేవు; కావున జగతి శల్య

శోధనముచేసి రచియింప శోభనంబు
మూఢగతిఁ గట్టరా దంద్రు మురవిదారి ! 58

గృహావరణమును సూత్రముఁబట్టికొలుచునప్పు డచటి కెవరయిన నేతెంచి అవర్గాక్షములు (అచ్చులు) మొదటఁ గల పదమున నుచ్చరించి ప్రశ్నించినయెడల తూర్పుదెస భూమిలోఁ మనిషిలోఁతున నేనుఁగు నెముకలుగాని పక్షియెముకలుగాని యుండును. కఖగఘలు మొదటఁ గల పదములతోఁ బ్రశ్నించిన నాగ్నేయదిశను జేతెఁడులోఁతున మేకయెముక లుండును. చఛజఝలు మొదటఁగలపదములతోఁ బ్రశ్నించిన దక్షిణపు దిక్కునఁ జేతెఁడులోఁతున నెనుఁబునెముక లుండును. టఠడఢ వర్ణములు మొదటఁగల పదములతోఁ బ్రశ్నించిన నిర్మృతి దిశను జేతెఁడు లోఁతున కుక్కయెముకలేని, మనుజునెముకలేని యుండును. తథదధ వర్ణములాదిఁ గలపదములతోఁ బ్రశ్నించిన బడమట రెండు చేతులలోఁతునఁ బాము నెముకలుకాని, మొసలి యెముకలు కాని యుండును. పఫబభలు ఆదినిగల పదములతోఁ బ్రశ్నించిన వాయవ్యదిశను జేతెఁడు లోఁతున నెలుక యెముకలైన లేడి యెముకలైన నుండును. యరలవ లాదినిఁగల పదములఁ బ్రశ్నించిన నేనుఁగు నెముకలేని, గుఱ్ఱము నెముకలేని నిలివెడు లోఁతున నుండును. శషసహ లాదినిఁగల పదముల బ్రశ్నించిన నీశాన్యమునఁ జేయిలోతున గుండేటి యెముకలేని ఎద్దు నెముక లేని నుండును. జఞణనములు మొదటఁ గల పదములఁ బ్రశ్నించిన నాయమున నేయెడను నెముక లుండవు. ఇది తెలిసి స్థలమును పరిశోధించి యెముక లెచ్చటను లేకుండఁ జూచి యిండ్లు కట్టుకొనిన శుభము గలుగును.

మ. సుమతుల్ శల్యము లిందు లేవుకద యంచుర్ బ్రశ్న గావింప ద
త్సమయం బారసి వాస్తువేది వెసఁ బాదచ్ఛాయలం దంతి నే
త్రములంగూరిచి భానుసంఖ్య నిరవొందం బెంచిపట్నేమభా
గముఁగావింపఁగ శేషసంఖ్య ఫలమార్గంబుల్వచింపందగున్.

గృహావరణము నేరుపఱచుసమయమునఁ బెద్ద లెవరేని 'ఇచట నెముకలు లేవుకదా!' యని యడిగినచో, వాస్తుశాస్త్రవేత్త యగువాఁడు తన నీడపొడవు నపుడు పాదముతోఁగొలిచి అయిన సంఖ్య కిరువదెనిమిదిని గూర్చిన, వచ్చిన మొత్తమును బండ్రెంటఁ బెంచి తల్లబ్ధమును బదునారింట భాగించవలెను. శేషించిన సంఖ్యనుబట్టి ఫలమును జెప్పఁదగును.

సీ. శేష మేకోత్తరాంచిత వృద్ధిఁ బ్రాగాది
దిశలఁ బదాఱింటఁ దెలియువరుస
నిలనుండును గపాల మిటుకయుఁ బెంకులుఁ
గట్టెలు దేవసంఘములనెలవు
బూడిద శవమును బొగ్గులు ధాన్యము
ధనముఁ బాషాణంబు దుర్దురంబు
గోశల్యసమితియుఁ గుక్కయెమ్ములుఁ బిశా
చముఁ బిశాచముల సంస్థాపనంబుఁ
బ్రశ్నలక్షణ మీరీతిఁ బరఁగియుండుఁ
గావున ధరిత్రి శోధింపఁ గాఁ బొసంగు
వెలయ నందు శుభాశుభంబులను దెలిసి
యిండ్లు గట్టినఁ దత్ఫలంబెసగుఁ గృష్ణ! 60

ఒకటిమిగిలినచోఁ దూరుపునఁ దలపుఱ్ఱెయు, రెండు మిగిలినఁ దూరుపునకు నాగ్నేయమునకు నడుమ నిటుకయు,

మూఁడుమిగిలిన నాగ్నేయమునఁ గుండపెంకులు, నాలుగు మిగిలిన దక్షిణమున నాగ్నేయమునకు నడుమఁ గట్టెలు, అయిదు మిగిలిన దక్షిణమున దేవతలు, ఆఱు మిగిలిన దక్షిణమునకు నిర్ౠతిదిశకునడుమ బూడిదయు, ఏడు మిగిలిన నిర్ౠతిదిశను శవస్థాపనము, ఎనిమిది మిగిలిన నిర్ౠతికిఁ బడుమటికి నడుమ బొగ్గులు, తొమ్మిది మిగిలిన బడుమట ధాన్యము, పది మిగిలినఁ బడుమటికి వాయవ్యమునకు నడుమ ధనము, పదనొకొండు మగిలిన వాయవ్యమున తాలు, పండ్రెండుమిగిలిన వాయవ్యమునకు నుత్తరమునకు నడుమఁ గప్పలు, పదుమూఁడుమిగిలిన ఉత్తరమున లావు నెముకలు, పదునాలుఁగు మిగిలిన ఉత్తరమునకు నీశాన్యమునకు నడుమఁ గుక్కయెముఁకలు, పదునయిదు మిగిలిన ఈశాన్యమున భూతములు, పదునారు మిగిలిన ఈశాన్యమునకుఁ దూరుపునకు నడుమ బిశాచసంస్థాపనము నుండును. వీనిలో మంచి నెబ్బరల నెఱిఁగి యిండ్లు కట్టుకొనవలెను.

తే. రమణతో భూమి శోధించుసమయమునను
నిటుక తాఁబేలు బియ్యము నిసుముఁ గప్ప
తాళ్లు గోశృంగములుఁగన్నఁ బ్రబలు భాగ్య
మనుచుఁ జెప్పిరి మునివర్యు లంబుజాక్ష! 61

భూమిని బరిశోధించునపు డిటుక, తాఁబేలు, బియ్యము, ఇసుక, కప్ప, తాళ్లు, ఆవుకొమ్ములు కనుపించినయెడల మంగళము.

క. కలహమగుఁ బెంకు లుండిన,
వెలిమిడి రోగంబు, పొట్టు పేదఱికము, బొ

గ్గులు మృతియుఁ, గట్టె లగ్ని
జ్వలితము కులనాశనంబు శల్యము లభవా! 62

భూమిని బరిశోధింపఁ బెంకులు గనుపించినఁ గలహము, బూడిద కనుపించిన రోగము, పొట్టున్న దారిద్ర్యము, బొగ్గు లగుపడిన మృత్యువు, కట్టె లున్న నగ్నిబాధ, ఎముక లున్నఁ గుల నాశనము నగును.

గృహావరణమున నుండు వివిధజంతుశల్యములకు ఫలము

సీ. భూశోధనము లేక పూనిగృహంబులు
గట్టిన నయ్యెడు నట్టి ఫలము
దెలిపెదఁ బశువులు గలిగియుండియు నింటఁ
బాఁడి లేకుండిన బాలుశల్య
ములు దూర్పు దెస నుండు; నిలవతులే ప్రొద్దుఁ
గోపంబుఁ జేసిన గుఱ్ఱమెముక
లాగ్నేయమున నుండు; నహరహంబును జ్వర
తాపము ల్గల్గిన దంతిశల్య
ములు నుండు దక్షిణంబున; ఋణంబులచేత
నుడివడియుండిన సూకరంబు
శల్యము లుండు రాక్షసునిదిక్కున; నప
మృత్యుఘోషంబులు మించెనేని
వృషభశల్యము లుండు వెసఁ బశ్చిమంబున;
గ్రామంబులోఁ బ్రజ ల్కలహమాడి
యూరువెళ్లుమటంచుఁ బోరెనగార్దభ
శల్యము ల్వాయుతస్థలిని నుండు;

నర్థనాశనము ప్రత్యహము గల్గినమేష
శల్యంబు లుండు వైశ్రవణు దెసను;
బోరుగు లెప్పుడు చాలఁ బోరుచు నుండిన
నీశాన్యమునఁ గుక్కయెముక లుండు;
నింటను గలహంబు లేప్రొద్దు గలిగిన
నట్టింటనుండును నరునిశిరము
ఇది పరీక్షింపవలసిన నిట్టిచోట్ల
నాలుజేనలు వెడలుపు నంతలోఁతు
త్రవ్వియది తీసివేయఁ గర్తకు లభించు
నాయురారోగ్యభాగ్యంబు లంబుజాక్ష! 63

భూమిని పరిశోధింపక యిండ్లుకట్టినయెడల నగుఫలము లను తత్కారణములను దెలుపుచున్నాఁడు:—పశువు లున్నను పాఁడిలేకుండునేని నిల్లుకట్టిన భూమియందుఁ దూరుపుదిక్కున శిశువులయెముకలుండును. ఇంటి యజమానునిపయి రాజెల్లపుడును గోపించుచుండిన నాగ్నేయమున గుఱ్ఱపుటెముక లుండును. ఇంటిలోనివారెల్లపుడును రోగములతో నవయుచుండినయెడల దక్షిణమున నేనుఁగు నెముకలుండును. ఋణబాధగలిగియుండిన యెడల నైరృతిమూలను బందియెముక లుండును. అపమృత్యువు తఱచు సంభవించుచుండునేని పడుమట ఎద్దునెముక లుండును. గ్రామములోనివారు జగడమాడి యూరువెడలఁగొట్టఁ జూచిన యెడల గాడిదయెముకలు వాయవ్యమున నుండును. ఎల్లప్పుడును ధనము నశించుచుండిన నుత్తరమున మేకయెముక లుండును. ఇరుగుపొరుగువారెప్పుడును జగడమాడుచుండినయెడల నీశాన్యమునఁ గుక్కయెముక లుండును. ఇంటిలోనివారు నిరంత

రముఁ బరస్పరము కలహించుచుండినయెడల నట్టింట మనుష్యుని తలపుచుకయుండును. ఆయాబాధలపా లగుచుండువా రాయా దిక్కు నాలుజేనలవెడలుపు, అంతియపాడవు, అంతియలోఁతు త్రవ్వి అచ్చట నున్న ఆయాజంతువుల యెముకలను దీసివేసిన యెడల నాబాధలు తొలఁగును.

### గుణావర్తనము

ఉ. వర్తిల్లు నేడుజేనలు దివౌకసగేహముల౯ ధర౯ గుణా,
వర్తనఁజేయ; బ్రాహ్మణనివాసము పణ్మితి, రాజగేహముల్,
స్ఫూర్తిగ నొప్పు, నైదిటను, బొంపగు నాల్గిట వైశ్యసద్మ
ముల్, గీర్తిదమౌను మూఁడిట నొగి౯ బదసంభవగేహ
ముల్ హరీ. 64

దేవాలయమునుగట్టుటకు నేడుజేనలలోఁతును బ్రాహ్మణులయిండ్లు గట్టుటకు నాలుజేనలలోఁతును రాజులయిండ్లకు నైదుజేనలలోఁతును వైశ్యులయిండ్లకు నాలుగుజేనలలోఁతును శూద్రులయిండ్లకు మూఁడుజేనలలోఁతును గుణావర్తనము (Foundation) త్రవ్వవలయును.

### గుణావర్తనమును నింపుట

క. మునుపు గుణావర్తనఁ జే
సింఘాతము నించురీతిఁ జెప్పెద ఱాళ్లు౯
తనరగ నిసుమును జలమును
నెనయఁగశాస్త్రోక్తమార్గ మిది వనజాక్షా! 65

గుణావర్తనమును మరలఁ బూడుచునట్టిరీతిని దెలుపుచున్నాను. ముందు త్రవ్వినగుంటయందు ఱాళ్లను బఱపవలెను. తరువాత నిసుకపోయవలెను. ఆటుపయి నీరు నింపవలెను. ఇట్లు

చేసి గుంటనుపూడిచి దక్షిణోత్తరముల నెత్తుగనుండునట్లు చూచు కొనవలెను.

## జలగతిలక్షణము

సీ. అన్యగేహజలంబు లాత్మగేహమున క
 గణ్యమైవచ్చినఁ గలహమొదవుఁ
దనయింటిలోనీళ్లు దగఁదూర్పు దెస నేఁగఁ
 బుత్రలాభంబెప్డుఁ బొసఁగఁజేయు
నాగ్నేయమున నర్థహానిసంపాదించు
 బెరయుదక్షిణమున మృత్యుభయము
రాక్షసేశుని దెస రాజభయం బగుఁ
 బశ్చిమంబునఁగీడు పత్నికొదవుఁ
బవనుని దెస నష్టి పశువుల కెప్పుడు
ధనదుని దెసఁ గల్గు ధనసమృద్ధి
శివునికోణముననుశివకరం బగునింట
నింకెనేనిఁ బొసఁగ దిందిరేశ! 66

ఇరుగువారి యింటినీరు తనయింటివైపు పారినఁ గలహము గలుగును. తన యింటినీరు తూరుపునకుఁ బాఱెనేనిఁ బుత్ర సంతతి గలుగును. ఆగ్నేయమునకుఁ బ్రవహించిన ద్రవ్యనాశన మగును. దక్షిణమునకుఁ బాఱిన మరణభయము గలుగును. నైరృతిదిశకుఁ బోవునేని రాజువలన భీతి గలుగును. పడమటి దెసకుఁబాఱిన భార్యకుఁ జెఱుపగును. వాయవ్యదిశకుఁ బాఱినఁ బశువులకుఁ జేటుమూడును. ఉత్తరమునకుఁ బోవునేని ధనలాభ మగును. ఈశాన్యమునకుఁ బాఱిన శుభము లగును. ఇంటనే యింకునేని యమంగళ మగును.

## ఏకాదశవర్గము

సీ. పదమెన్మిదిటఁ బెంచి పంద్రెంటఁ బొల్గొన్న
శేషంబు ధన మగు శ్రీనివాస!
శిఖి వసుసంఖ్యల శేషంబు ఋణ మగు
నవగజశేషంబు నాయ మగును
చెలువుగ ఋతుదిన శేషంబు తిథి యగు
నవసప్తశేష మెన్నఁదగు వార
మష్ట తారా శేష మగును నక్షత్రంబు
యుగయోగ శేషంబు యోగమరయ
బాణపర్వత శేషంబు పరగుఁ గరణ
మంగ నవ శేష మెన్నఁగ నంశ యగును
తొమ్మిదియు నూటయిరువదిఁ దోఁచునాయు
వాయువష్టమ శేష మాశాధిపతులు. 67

ఇంటి యడుగు నిడుపును వెడలుపుతో గుణింపనగు లబ్ధము, పదము, క్షేత్ర (ఫల)ము, ధ్రువము నను పేరులఁ బరఁగును. అట్టి పదమును ఎనిమిదితోఁ బెంచి పంద్రెంట భాగింపఁగా మిగిలిన సంఖ్య ధనము; మఱియు నాపదమునే మూఁటఁ బెంచి యెనిమిదింట భాగింప మిగులు శేషము ఋణము; తొమ్మిదిటఁ బెంచి యెనిమిదిట భాగింప మిగిలినది ఆయము; ఆఱింటఁ బెంచి ముప్పదిట భాగింప మిగులునది తిథి; తొమ్మిదిచేఁ బెంచి యేడింట పాలుగొన మిగులు సంఖ్య వారము; ఎనిమిదిచేత గుణించి యిరువదియేడింట భాగింప నిలుచు శేషము నక్షత్రము; నాల్గిటఁ బెంచి యిరువదియేడింట హరింప మిగులు శేషము యోగము; అయిదుచేఁ బెంచి యేడింట పాలుగొన

మిగులునది కరణము; ఆయుతో గుణించి తొమ్మిదిచే భాగింప నుండు శేషము అంశము; తొమ్మిదితోఁ బెంచి నూటయిరువదితో హరింప మిగిలినది ఆయుస్సు; ఆయుస్సునే యెనిమిదిట భాగింప మిగులు సంఖ్య దిక్పతి అగును. ఇట్లు ధన ఋణాదులను పెంచి భాగింపఁగా శేషము లేకుండునేని ధనము ౧౨, ఋణము ౮, ఆయము ౮, తిథి ౩౦, వారము ౭, నక్షత్రము ౨౭, యోగము ౨౭, కరణము ౭, అంశ ౯, ఆయువు ౧౨౦, దిక్పతి ౮ అని యెఱుఁగునది.

## ధనఋణములు

క. ధన మెక్కుఁడయిన ధనికుఁడు
ఋణ మెక్కువ యయినఁ గర్త ఋణవంతుఁడగుఁ
ధనఋణములు సమమయినను
వినుఁ డాదాయంబు కొలఁది వెచ్చము కృష్ణా! 68

ధనమధికము, ఋణము తక్కువ అయిన గృహపతి ధనవంతుఁ డగును. ఋణమధికము, ధనము తక్కువ అయిన అప్పుల పాలగును. ధన ఋణములసంఖ్య సమమయిన నాదాయము వ్యయము సమముగ నుండును.

## ఆ య ము లు

సీ. పద మెన్మిదింటిచేఁ బాలుగొనిన శేష
మొక్కటైనను ధ్వజం బొనరుఁ గృష్ణ
రెంట ధూమంబు మూఁడింట సింహంబు నా
ల్గింటఁ గుర్కుర మయి దింట వృషము
ఖరమగు షట్కంబు, గజ మేడిటను గాక
మెనిమిది మిగిలిన నెసఁగియుండు

నైంద్రదిశాదిగా నాయంబు లెన్మిది
కర్త లింద్రాది దిక్పతులు వరుస
హరియు గజమున నుండుఁ గేసరియు గజము
వృషము పయినుండుఁ దనయందె వృషభముండు
ధూమమునఁ దక్క నన్నిటఁ దొడరుధ్వజము
నవలి వందందె తగుఁ జొరవన్యదిశల. 69

పదమును దొమ్మిదితోఁ బెంచి యెనిమిదిటఁ బాలుగొన్న శేష మొకటి యయిన ధ్వజాయము; రెండయిన ధూమాయము; మూఁడయిన సింహాయము; నాలుగయిన శ్వానాయము; అయిదయిన వృషభాయము; ఆఱయిన ఖరాయము; ఏడయిన గజాయము; ఎనిమిదయినఁ గాకాయము. ధ్వజాయమునకు నింద్రుఁడు; ధూమాయమున కగ్ని, సింహాయమునకు యముఁడు, శ్వానాయమునకు నిర్ఋతి, వృషభాయమునకు వరుణుఁడు, ఖరాయమునకు వాయువు, గజాయమునకుఁ గుబేరుఁడు, కాకాయమున కీశానుఁడు నధిపతులు. ఆయా యాయములను వానివాని యధిపతుల దిక్కులయందుఁ గట్టవచ్చును. మఱియు సింహాయము నుత్తరమునను, సింహగజాయములను బడమటను, వృషాయమును బడమటను మాత్రమును, ధ్వజాయము నాగ్నేయమునఁ దక్కఁ దక్కిన యన్ని దిక్కులనుగూడ గట్టవచ్చును. తక్కిన ఆయములను తమయధిపతుల దిక్కులయందు మాత్రమే కట్టవచ్చును. ఇతర దిక్కులఁ గట్టరాదు.

క. ధ్వజ సింహ వృషభ గజములు
నిజముగ వర్తిల్లు విప్రనృపగృహములకుఁ

ధ్వజ వృషభ గజాయములూ
రజపాదజులకుఁ దగున్ సరోరుహనయనా!* 70

ధ్వజాయసింహాయములు బ్రాహ్మణులకును క్షత్రియులకును, వృషభాయగజాయములు వైశ్య శూద్రులకును దగును.

చ. ధ్వజము కృతార్థతం జెలఁగుఁ దద్దయుమృత్యువొసంగు ధూ
మమున్, విజయము సింహ మెన్నఁ గడవెళ్ళనిరోగమఁ
గుర్కురంబునన్, నిజ మగురాజ్యమావృషము నిత్యము
దుఃఖము రాసభంబునన్, గజము శుభం బొనర్చు మఱి
కాకము నిష్ఫల మంబుజాననా. 71

ధ్వజాయము గృహపతిని గృతార్థునిఁజేయును; ధూమాయము గృహపతికి మృతిని గలిగించును; సింహాయము విజయ

---

* ఒకానొక మాతృకయం దీక్రిందిపద్య మిచట గలదు. దీని కర్థము స్పష్టము.

సీ. కమ్మరి కంచరి కమసాల కుమ్మరి
యుపజీవులకు ధూమ మొనరు నెపుడు
నతిపరాక్రమవంతులకు నాయుధోపజీ
వులకు సింహాయము జెలువొసంగు
జర్మకారకతురుష్కనవామిషాశన
పలల విక్రయులకు నలరు శునము
బేహార్లు గొల్లలు...కృషికుల
కగువృషభాయంబు నవనిలోన
వేశ్యలకు నటకులకును వెలయుఖరము
సాలెవాండ్రకుఁ జెట్లకు సామజంబు
నంత్యజాంబష్ఠ రజకుల కగునుగాక
యఖిల వర్ణంబులకు ధ్వజాయంబు శుభము.

మును గలిగించును; శ్వానాయము రోగమునుగలుగఁజేయును; వృషభాయము రాజ్యమును గలిగించును; ఖరాయము దుఃఖ కరము; గజాయము సౌఖ్యము నొసఁగును. కాకాయము నిష్ప్రయోజక మగును.

క. ప్రకృతమగు వేళ నాయము
నకుటిలమతి నిర్ణయింప నంగుళహీనా
ధికమయినఁ బూర్ణ ఫల మగు
సుకరం బగు నొండుగాదు సురపతి వినుతా! 72

ఆయములమాన మంగుళ మెక్కువయినను దక్కువయి నను బూర్ణాయ ఫలమునే కలుగఁజేయును.

తే. ధ్వజమునకు మూఁడు ఋణ మాఱు నిజము ధూమ
మునకు నొక్కటి హరికి నాల్గెనయు శునికి
నేడు గోసంఖ్య ఖరమున కెసఁగు రెండు
గజమునకు నైదు వసు సంఖ్య కాకమునకు. 73

ఋణము ధ్వజాయమునకు మూఁడు, ధూమాయమున కాఱు, సింహాయమున కొకటి, శ్వానాయమునకు నాలుగు, వృషభాయమున కేడు, ఖరాయమునకు రెండు, గజాయమున కయిదు, కాకాయమున కెనిమిది యగును.

## తిథులు

ఆ. శుద్ధపాడ్యమయిన శోకంబు వాటిల్లు
రిక్తదినము లయిన రిక్తుఁ జేయు
దర్శయందుఁ బతికిఁ దప్పదు మృత్యువు
కడమదినములందుఁ గలుగు శుభము. 74

ఆయము తిథి శుద్ధపాడ్యమి గృహపతికి దుఃఖమును గలిగించును. చవితి నవమి చతుర్దశి అను రిక్తతిథులు దారిద్ర్యమును గలిగించును. అమావాస్య మృత్యువును గలిగించును. తక్కిన తిథులు శుభదాయకములు.

## వారములు

తే. శుక్రసోమవాసరములు శుభకరములు
బుధబృహస్పతి వారాలఁ బొసగు ధనము
సూర్యభౌములవారముల్ శోకకరులు
శనిదినము తస్కరభయంబు జలజనాభ! 75

ఆయముయొక్క వారములు శుక్ర సోమవారము లయిన శుభముగలుగును; బుధగురువారములయిన ధనము గలుగును; సూర్యాంగారకవారము లయిన దుఃఖము గలుగును; శనివారమయిన దొంగలభయమును గలుగును.

## వారములకుఁ గరణములు

తే. భానువాసరమాదిగాఁ బ్రబలునేడు
వాసరంబుల వర్తించు వణజి గరజి
పరఁగఁ దైతిల కౌలవ బాలవములు
క్రమముతో బవభద్ర లనఁ గరణము లగు. 76

ఆదివారమునకు వణజి, సోమవారమునకు గరజి, మంగళవారమునకుఁ దైతిల, బుధవారమునకుఁ గౌలవ, గురువారమునకు బాలవ, శుక్రవారమునకు బవ, శనివారమునకు భద్రాకరణము అని ఏకాదశవర్గగణితసిద్ధము.

—⊙ నక్షత్రములు ⊙—

సీ. రూపింప నశ్విని రోహిణి మృగశీర్ష
లలపుష్య హస్త చిత్రానురాధ
లారూఢిమై నుత్తరాషాఢవిష్ణువుల్
సరవి ధనిష్ఠయు శతభిషంబు
లనఁదగునీతార లత్యుత్తమంబులు
నుర్వి నార్ద్రపునర్వసూత్తరలును
బరఁగజ్యేష్ఠోత్తరాభాద్ర రేవతులవి
మధ్యమతారలు మఱియు భరణి
వహ్న్యాఖ్యాశ్లేషమఖలు పూర్వత్రయంబు
నెలమి స్వాతివిశాఖమూలలను బదియు
నధమతారలు నింద్యంబు లనఁగఁదగును
వాస్తుసిద్ధాంతమార్గముల్వారిజాక్ష! 77

అశ్విని, రోహిణి, మృగశీర్ష, పుష్యమి, హస్త, చిత్త, అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము నను నీపదునొకండు ఆయనక్షత్రము లుత్తమములు. ఆర్ద్ర, పునర్వసు, ఉత్తర, జ్యేష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి అను నీయాఁటు నక్షత్రములు మధ్యమములు. భరణి, కృత్తిక, ఆశ్లేష, మఖ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, స్వాతి, విశాఖ, మూల అను నీపది నక్షత్రములు నధమములు. ఇవి గృహనిర్మాణ కాలపు నక్షత్రములు కావు. ఏకాదశ వర్గగణితానుసారము ఆయమునకుఁ జెందినవి:

## యోగములు

తే. వజ్రపరిఘువ్యతీపాత వైధృతులును
గండశూలాతిగండవిష్కంభములును
నరయ వ్యాఘాతమును నివి యశుభదములు
కడమయోగంబు లెల్లను గార్యసిద్ధి. 78

ఏకాదశవర్గగణితసిద్ధము లగు యోగముల వజ్రము, పరిఘ, వ్యతీపాతము, వైధృతి, గండము, శూలము, అతిగండము, విష్కంభము, వ్యాఘాతము అనుయోగము లమంగళములు. తక్కినవన్నియు శుభకరములు.

## నక్షత్రయోగములు, తత్ఫలము

తే. అశ్వి హర్ష విధి ప్రీతి అదితిపాత
పైతృ శోభన హస్త శివద్వి దైవ
ధృతి నిర్మృతిశుభ విష్ణువృద్ధి స్వజాంఘ్రి
నైంద్రమును వార్ధిలోకధనాంశ లభవ. 79

అశ్వినికి హర్షము, రోహిణికిఁ బ్రీతి, పునర్వసునకు వ్యతీపాత, మఖకు శోభనము, హస్తకు శివము, విశాఖకు ధృతి, మూలకు శుభము, శ్రవణమునకు వృద్ధి, పూర్వాభాద్రకు నైంద్రము ననునవి యోగములు. ఈనక్షత్రములయొక్క యీ యోగములకు ధనము నాలుగు, అంశ మూఁడు నగును.

సీ. భరణి విష్కంభంబు పద్మారిసిద్ధియుఁ
బుష్యసౌభాగ్యముల్ పుబ్బ పరిఘ
చిత్త సుకర్మంబు మైత్ర సాధంబు పూ
ర్వాషాఢగండంబు వసువుబ్రహ్మ

ఉత్తరాభాద్రయు నొనర వ్యాఘాతంబు
నివి ధనమెన్మిదా యైన్ననంశ
అగ్నియు వజ్రంబు నార్ద్రి యాయుష్మాను
నహివరీయాను త్తరాతిగండ
మనిలభము సిద్ధ మింద్రర్క్ష మొనర శూల
ఉత్తరాషాఢ శుక్లంబు నుదకపతియు
ధ్రువము రేవతి వైధృతి నివియు ధనముఁ
బదియు రెండంశ తొమ్మిది పంకజాక్ష! 80

భరణికి విష్కంభమును, మృగశీర్షకు సిద్ధియు, పుష్యమికి సౌభాగ్యమును, పుబ్బకుఁ బరిఘము, చిత్రకు సుకర్మము, అనూరాధకు సాధ్యము,పూర్వాషాఢకు గండము, ధనిష్ఠకు బ్రహ్మము, ఉత్తరాభాద్రకు వ్యాఘాతము ననునవి యోగములు. వీనికి ధన మెనిమిది, అంశ యయిదు నగును. కృత్తికకు వజ్రము, ఆర్ద్రికు ఆయుష్మాన్, ఆశ్లేషకు వరీయాన్, ఉత్తరకు అతిగండము, స్వాతికి సిద్ధము, జ్యేష్ఠకు శూల, ఉత్తరాషాఢకు శుభ్రము, శతభిషకు ధ్రువము, రేవతికి వైధృతి ననునవి యోగములు. వీనికి ధనము పండ్రెండు, అంశ తొమ్మిది యగును.

## కరణములు

క. మేలొదవును బవ బాలవ
కౌలవతైతులలు గరజి కడుమధ్యమ మే
వేళను వణజియు భద్రయు
వాలాయముఁ గానివండ్రు వసుదేవసుతా! 81

ఏకాదశవర్గగణిత సిద్ధములగు కరణములలో బవ,

బాలవ, తైతుల, కౌలవ లుత్తమములు. గరజి మధ్యమము వణజిభద్రలు రెండును నెల్లపుడును నశుభదములు.

## అంశలు

ఆ. సారివి నష్ట వృద్ధి శుభదాహామృతిచోర
పుత్ర గోసమాజ పుష్టులందు
నలరు మూఁడు తొమ్మిదంశల శుభమొందు
హీనమగు షడంశ యెన్నఁ గృష్ణ! 82

నష్టాంశ, వృద్ధ్యంశ, ధ్రువాంశ, దాహాంశ, చోరాంశ, పుత్రాంశ, గోధనాంశ, పుష్ట్యంశ అనునవి తొమ్మిది అంశలు వీనిలో మూఁడు తొమ్మిది యుత్తమములు. ఆఱవది యధమము. తక్కినవి మధ్యమములు.

## ఆయుఃపరిమాణ దిక్పతిఫలములు

సీ. అలువదేండ్లకు నాయువధికమై యున్నను
గర్తను భాగ్యసంకలితుఁ జేయు
హీనమైనఁ బతికి హానిప్రదంబగు
నింద్రుండు కామ్యార్థ మిచ్చు నెపుడుఁ
బవనమిత్రుఁడు వహ్ని భయము సంపాదించు
యముఁ డశుభంబుల నలరఁ జేయు
రాక్షసేశ్వరుఁడు శాత్రవ భయం బొనరించు
వరుణదేవుఁడు పశుప్రద మొనర్చు
చంచలం బొనర్చు సరవి గంధవహుండు
ధనము నిచ్చు నెపుడు ధనదుఁ డరయ
శివుఁడు కీడు మేలుఁ జేయుఁ గావున నాయు
రధిపతులఫలంబు లవనిఁ గృష్ణ! 83

ఆయు స్సఱువది యేండ్లకు మించి యుండెనేని గృహపతికి నైశ్వర్యము గలుగును, తగ్గియుండెనేని చెఱుపు గలుగును.

ఇంద్రుఁ డధిపతియయిన నింటి యజమానికి శుభమగును. అగ్ని యధిపతియయిన నింటికి నగ్నిభయము గలుగును. యముఁ డశుభఫలదుఁ డగును. నిర్బతి శత్రుభయమును గలిగించును. వరుణుఁడు పశువులను బెంపొందించును. వాయువు స్థైర్యహానిఁ జేయును; కుబేరుఁడు ధనము నొసఁగును. శివుఁడు కీడును మేలును గూడ దెచ్చి పెట్టును.

## భూతతత్వ లగ్నములు

మ. పదముఁ మూఁటఁ బెంచి యైదిటఁ దగన్ భాగించి తచ్ఛే
షసంఖ్యఁ దగన్ భూజల వీతిహోత్రమరుదాకాశాఖ్య
తత్త్వంబులన్, గదియన్ భాగ్యము మోదమున్ మృతియు,
శోకంబున్ దరిద్రత్వమున్, మది నూహించి గృహంబుఁ
గట్టినగు సన్మాన్యుల్ సురేశస్తుతా! 84

గృహముయొక్క పదమును మూఁటఁబెంచి యైదుతో భాగింపవలెను. శేష మొకటియైన భూతత్త్వము ఫలము భాగ్యము. రెండు మిగిలిన జలతత్త్వము. ఫలము సంతోషము. మూఁడు మిగిలిన నగ్నితత్త్వము. ఫలము మృత్యువు. నాలుగు మిగిలిన వాయుతత్త్వము. ఫలము దుఃఖము. అయిదు మిగిలిన నాకాశతత్త్వము ఫలము దారిద్ర్యము.

ఆ. పదముఁ దొమ్మిదింట బాగుగా గుణియించి
ప్రౌఢి నాలుగింటఁ బాలుగొన్న

శేషసంఖ్య కులము సిద్ధంబు జనులకుఁ
గులముఁ గులముఁ గూర్పవలయుఁ గృష్ణ! 85

పదమును దొమ్మిదితో గుణించి నాలుగింట విభాగింపఁగా నొకటిమిగిలిన బ్రాహ్మణకులము; రెండుమిగిలిన క్షత్రియకులము, మూఁడు మిగిలిన వైశ్యకులము, నాలుగుమిగిలిన శూద్రకులము నని యెఱుఁగునది. ఏకులమువారి కాకులమునే కూర్పవలయును. ఎక్కువ తక్కువ కులములు పనికిరావు.

## రాశ్యధిపతి, క్రూరసౌమ్య, వర్ణనిర్ణయము

సీ. అరయ సింహంబున కధిపతి సూర్యుండు
కర్కటకం బేలుఁ గమలవైరి
అజవృశ్చికంబుల కవనిపుత్త్రుఁడు భర్త
మిథునాంగనలకును బుధుఁడు విభుఁడు
అలర ధనుర్మీనములకర్త గురుఁడగు
వృషభతులలకును విభుఁడగుఁ గవి
నక్రకుంభములకు నాథుండు శని మఱి
రవికుజశనికేతురాహు లెలమిఁ

క్రూరు, లితరులు సౌమ్యులు, గురుఁడు కవియు
బ్రాహ్మణులు సూర్యభౌములు రాజకులము
చంద్రసౌమ్యులు వైశ్యులు శనియు శూద్ర
జాతిపాలకుఁ డనఁదగు సరసిజాక్ష! 86

సింహమునకు రవి, కర్కటకమునకు సోముఁడు, మేష వృశ్చికముల కంగారకుఁడు, మిథున కన్యలకు బుధుఁడు, ధనుర్మీనములకు గురుఁడు, వృషభతులలకు శుక్రుఁడు, మకరకుంభములకు శని అధిపతులు. సూర్యుఁడు, అంగారకుఁడు, శని, రాహు

కేతువులు క్రూరగ్రహములు చంద్రుఁడు, బుధుఁడు, గురువు, శుక్రుఁడు సౌమ్యగ్రహములు. గురుశుక్రులు బ్రాహ్మణులు; సూర్యాంగారకులు క్షత్రియులు, చంద్రబుధులు వైశ్యులు, శని శూద్రుఁడు, ఆయాజాతి గ్రహము లాయాజాతివారికిఁ దగును.

### నవవర్గగణితవిధానము

సీ. ఇంటికై చేకొన్నయిల దీర్ఘబాహువుల్
వెలుపు హస్తములచేఁ గలయఁబెంచి
నాగాగ్నినిధిగజ నవదంతిజలనిధి
పంచషట్కములఁ నేర్పడ గుణించి
యినదంతివారణదినశైలనక్షత్ర
యోగాద్రినిధులచే భాగశేష
మగుప్రతులబ్ధఋణాయనివసవారతా
రాయోగకరణాంశ లాయె వరుస
నివియ నవవర్గ మని పల్క విదిత మగును
గణితమర్మంబుఁ దెలిసినఘనులు మదిని
వీటిఫలతారతమ్యము ల్వేదకవలయు
వాస్తుశాస్త్రమతం బిది వాసుదేవ! 87

ఇండ్లుకట్ట నిశ్చయించినభూమి నిడుపు వెడలుపులను గొలిచి వచ్చినసంఖ్యల నొండొంటఁబెంచ వచ్చినలబ్ధము పద మనఁబడును. పదసంఖ్య నెనిమిదితోఁ బెంచి పండ్రెండుతో భాగింప మిగిలినసంఖ్య ధనము. మూఁటఁ బెంచి యెనిమిదింట భాగింప మిగిలినసంఖ్య ఋణము. తొమ్మిదింటఁ బెంచి యెనిమిదింట భాగింప మిగిలినది ఆయము. ఎనిమిదిచేతఁ బెంచి ముప్ప

దిట భాగింప మిగిలినది తిథి. తొమ్మిదితోఁ బెంచి ఏడుతో భాగింప మిగిలినది వారము. ఎనిమిదిటఁ బెంచి యిరువదియేడింట భాగింప మిగిలినది నక్షత్ర మగును. నాలుగుతో గుణించి యిరువది యేడుతో భాగింప మిగిలినది యోగము. అయిదింటఁ బెంచి యేడింట భాగింప మిగిలినది కరణము. (కరణములు పదునొకొండు గాన, పదునొకండుతో భాగింపవలెనని కొందఱి మతము.) ఆఱుతో గుణించి తొమ్మిదితో భాగింప శేషించినది యంశయగును. ఈపద్ధతి గణితమునకు నవవర్గగణిత మని పేరు.

## షడ్వర్గ గణిత విధానము

సీ. నిడుపువెడల్పుల నియతంబుగాఁ బెంచి
యాలెక్కఁ బట్టిరీతు లటుల నుంచి
నాగాగ్ని నందాష్ట నవపరంబులఁ బెంచి
యర్కాష్ట వసుతారకాద్రినిధుల
భాగింపఁగా నిల్వఁబడిన యాశేషముల్
ధనఋణాయంబులు దారకములు
వారాంశ లగుఁగాన వరుసతో నీరీతి
గణితజ్ఞులై నట్టి ఘనులు దెలిసి
యిందుఁ దారాబలంబులు పొందుపఱిచి
లగ్నసంపద యుండఁగ లలితముగను
ఇండ్లు గట్టిన శుభఫలం బిచ్చునెపుడుఁ
బరఁగ షడ్వర్గ మిదియంద్రు పంకజాక్ష! 88

ఇల్లుకట్టవలసిననేల నిడివి వెడలుపుల నొండొంటఁ బెంచఁగా వచ్చిన లబ్ధము పదము. దాని నెనిమిదితోఁ బెంచి పండ్రెండుతో భాగింపఁగా నిలిచినసంఖ్య ధనము; మూఁడిటఁ బెంచి యెనిమిదిటఁ

పాల్గొనఁగా మిగిలినది ఋణము, తొమ్మిదితో గుణించి యెనిమిదితో భాగింపఁగా మిగులునది ఆయము; ఎనిమిదిటఁ బెంచి యిరువదియేడిట భాగింప శేషించునది నక్షత్రము; తొమ్మిదిట గుణించి ఏడుతో భాగింప మిగులునది వారము; ఆఱిటఁ బెంచి తొమ్మిదిటఁ బాలుగొన మిగులునది యంశయగును. ఇది షడ్వర్గగణిత విధానము. వీనితోపాటు తారాబల చంద్రబలములను, లగ్న శుద్ధిని జూచుకొని యిండ్లు కట్టిన శుభము చేకూరును.

తే. చనుఁ జతుర్దశవర్గలక్షణము లప్పు
గొదువపడునేనిఁ దగుఁ బదొకొండువర్గ
లవియుఁ బొసఁగమి నవవర్గ లరయ మేలు
తుదకు షడ్వర్గశుద్ధియేన్దొరకవలయు. ౩౯

ఇండ్లు గట్టుటకుఁ జతుర్దశ వర్గ శుద్ధి యుత్తమోత్తమము లేకున్న ఏకాదశవర్గ శుద్ధి చూడవలెను. అదియును లేమిని నవ వర్గశుద్ధి వలయును. దానికిఁ దగ్గిన షడ్వర్గశుద్ధియైన వలయును. ఇందేదియు లేక యిండ్లుగట్టినఁ గీడుమూఁడును.

వ. తదనంతరంబ యర్వణక్రమము నిరూపించెద. ౪౦

### అందుఁ గర్తృనక్షత్రనిర్ణయము

తే. ఆహవవ్యవహారభృత్యాలయముల
గ్రామమంత్రస్వపాశ్రయకరణములకు
జన్మనక్షత్ర మర్థింపఁ జనదు వసుధ
నామతార ప్రశస్తంబు నరులకెల్ల. ౪౧

యుద్ధమునకు వ్యవహారముఁ జేయుటకు సేవకుల కిండ్లు గట్టుటకు, గ్రామములఁ గట్టుటకు (గ్రామార్వణముఁ జూచుటకు

నని మతాంతరము), మంత్రోపదేశమునకు, రాజుల యిండ్లు గట్టుటకు జన్మనక్షత్రము పనికిరాదు! నామనక్షత్రమునుబట్టి మేలు కీళ్ల నెఱుఁగవలెను.

### స్థానబలమును జూచుపద్ధతి

సీ. కర్తనక్షత్రంబు గ్రామనక్షత్రంబు
నిలయనక్షత్రంబుఁ గలియఁ గూడి
గ్రహసంఖ్యఁ బాల్గొన్నఁ గడఁగి యొక్కటినిల్వ
ధనలాభ మొందించుఁ దత్ప్రతికిని,
ధనహాని రెండున్నఁ దప్పదు, మూఁడున్న
క్షేమంబు, నాల్గుసంగ్రామమందు,
నయిదైన సుఖమగు, నాఱున్న రిపుభయం,
బేడున్న నృపపూజ నెలమిఁ గాంచు
నష్టమంబున నాశనం బగును దొమ్మి
దయిన బహుధాన్యసంపద లవనిఁ గలుగు
ననుచు నీస్థానలక్షణం బెఱుఁగవలయు
వాస్తువిదుల మతం బిది వారిజాక్ష! 92

అశ్విని మొదలు గృహపతి నక్షత్రమువఱకు లెక్కింప వచ్చినసంఖ్యను, అశ్విని మొదలు గ్రామనక్షత్రమువఱకు లెక్కింప వచ్చిన సంఖ్యను, అశ్విని మొదలు గృహనక్షత్రమువఱకు లెక్కింప వచ్చిన సంఖ్యను గలియఁగూడిన నగు మొత్తమును దొమ్మిదితోఁ బాల్గొనవలెను. అట్లు చేయ శేషమొక్కటియున్న ధనలాభము; రెండున్న ధననాశము; మూఁడున్న క్షేమము; నాల్గున్న యుద్ధ భయము; అయిదున్న సుఖము; ఆఱున్న శత్రుభయము; ఏడున్న రాజపూజ; ఎనిమిదున్న నాశము; తొమ్మిదున్న ధాన్యలాభము

గలుగును. ఇట్లు స్థానలక్షణ ఫలములను దెలిసి యిండ్లను గట్టి కొనవలయును.

## తారాబలము దెలియువిధము

సీ. గృహపతి తారాది గృహభాంతముగ నెంచి
నిధిసంఖ్య భాగింప నిల్చునదియు
నక్షత్ర మొకటైన నాశంబు నొందించుఁ
దగదు మూఁడవతార ధనముఁ జెఱచుఁ
బంచమతారైనఁ బతి దుఃఖముంబొందు
సప్తమతారైనఁ జావు నిజము
నవమతార యయిన నాశనం బొందించు
సమతార లయినను సౌఖ్య మొసఁగుఁ
బతికి గృహమున కిట్లు దంపతులరీతిఁ
జెలఁగి తారాబలంబు వీక్షింపవలయు
నెవ్వరేనియుఁ దెలియక యిండ్లుగట్ట
రాదుగావున నిద్ది మర్యాద కృష్ణ! 93

గృహపతి నక్షత్రము మొదలు గృహనక్షత్రము వఱకు లెక్కించి వచ్చిన మొత్తమును తొమ్మిదిచేఁ బాలుగొనవలెను. శేష సంఖ్య తార యనఁబడును. ఆశేష మొకటి యయిన గృహపతికి నాశమును, మూఁడయిన ధనహాని అయిదయిన దుఃఖము, ఏడ యిన మృత్యువు, తొమ్మిదయిన హాని గలుగును. సమ సంఖ్యలు మిక్కిలి మేలును జేకూర్చును. దంపతులకువలె గృహపతి గృహ ములకుఁ దారాబలము చూడఁగియుండవలెను.

## నక్షత్రవేధ

సీ. ప్రకటింప నశ్విని భరణి కృత్తిక రోహి
ణులకు జ్యేష్ఠానురాధలు విశాఖ
వాయువుల్ శత్రువుల్, వరుసతో మఘపుబ్బ
ఉత్తరహస్తల కుద్ధృతముగఁ
బగలు పూర్వోత్తరాభాద్ర పూర్వాభాద్ర
వరుణతారలు, మూలవారి విశ్వ
గోవిందులకు సర్పగురువుల్ పునర్వసు
శివులు వైరులు, త్వష్ట్రవసువులకును
జగతి నన్యోన్య శాత్రవంబగుఁ బురాణ
నృపతి మనుభాను సంజ్ఞల రిపులు దెలియ
నగును వస్రాది నాల్గు మఘాదినాల్గు
రమణ మూలాదినాల్గుతారకలు కృష్ణ! 94

అశ్విని, మఖ, మూలా నక్షత్రము లాదిఁగ నాల్గునాలు గేసి నక్షత్రములలో క్రమముగ తొలిదానికిఁ బదునెనిమిదవది, రెండవ దానికిఁ బదునాఱవది, మూఁడవదానికిఁ బదునాలుగవది, నాలవ దానికిఁ బన్రెండవది యగు నక్షత్రములు వేధనక్షత్రములని తెలిసికొనవలెను. అనగా అశ్వినికి జ్యేష్ఠ, భరణి కనూరాధ కృత్తికకు విశాఖ, రోహిణికి స్వాతి వేధలు. మఖకు రేవతి, పుబ్బ కుత్తరాభాద్ర, ఉత్తరకుఁ బూర్వాభాద్ర, హస్తకు శత భిషము వేధలు. మూలకు నాశ్లేష, పూర్వాషాఢకుఁ బుష్యమి, ఉత్తరాషాఢకుఁ బునర్వసు, శ్రవణమునకు నార్ద్ర వేధలు. మృగ శీర్ష, చిత్త, ధనిష్ఠలకుఁ బరస్పరము వేధలు. ఇది తెలిసి నిర్దుష్ట ముగఁ జూచి యిండ్లు కట్టుకొనవలెను.

## గ్రహముల శత్రుత్వ మిత్రత్వములు

సీ. రవికాప్తు లిందుధరాసుతాంగీరసుల్
 శత్రువుల్ భార్గవశనులు దలఁప
శశిసఖు లినబుధుల్ శత్రులెవ్వరు లేరు
 కుజునకు రవిచంద్రగురులు హితులు
నగబుధుఁడౌ సౌమ్యబంధువుల్ రవిశుక్రు
 లరి నిశాధీశుండు గురునిమిత్రు
లాదిత్యశశిభౌము ల్హితులు బుధకవుల్
 మఱి కావ్యుచట్టముల్ మందబుధులు
శత్రు లినచంద్రు లెన్నఁగ శనికిఁ గూర్చు
వారు బుధశుక్రు లౌదురు వైరులెలమిఁ
జంద్రరవిలోహితాంగు లీసరణిఁ గడమ
గ్రహములెల్లను సములు నిక్కంబు కృష్ణ! 95

సూర్యునకుఁ జంద్రుఁడు, అంగారకుఁడు, బృహస్పతి మిత్రులు; శుక్ర శనులు శత్రువులు. చంద్రునకు సూర్యుఁడు, బుధుఁడు మిత్రులు; శత్రువులు లేరు. అంగారకునకు సూర్యుఁడు, చంద్రుఁడు, గురువు హితులు; బుధుఁడు శత్రువు. బుధునకు సూర్యుఁడు, శుక్రుఁడు మిత్రులు; చంద్రుఁడు శత్రువు. గురువునకు సూర్యుఁడు, చంద్రుఁడు, అంగారకులు మిత్రులు; బుధుఁడు, శుక్రుఁడు శత్రువులు. శుక్రునకు శని, బుధుఁడు మిత్రులు; సూర్యుఁడు, చంద్రుఁడు శత్రువులు. శనికి శుక్రుఁడు, బుధుఁడు మిత్రులు; చంద్రుఁడు, సూర్యుఁడు, అంగారకుఁడు శత్రువులు. శత్రువులు మిత్రులుగాని గ్రహములు సములు.

## రాశ్యధీశ్వర శత్రుత్వమిత్రత్వఫలము

శా. అన్యోన్యంబగు మైత్రిసౌఖ్యముసమృతం బన్యోన్యశత్రుత్వమ
న్యోన్యంబైన సమత్వముం దెవులు చెందుం శత్రుమిత్రత్వ
ముల్, బన్యంబౌ సమశాత్రవంబున మనస్తాపంబు సంధించు
సా, మాన్యంబౌ సమమైత్రి ధీరులు మదిం భావించి చెప్పం
దగుం. 96

గ్రహముల పరస్పరమైత్రివలన మిగుల సుఖము గలుగును. పరస్పరశత్రుత్వమువలన మృత్యువు గలుగును. పరస్పర సమత్వమువలన రోగము గలుగును. శత్రుమిత్రత్వమువలనఁ గలహము గలుగును. సమశత్రుత్వమువలన మనస్తాపము గలుగును. సమమైత్రివలన మధ్యమఫలము గలుగును.

## నక్షత్రగణములు

సీ. అశ్విని మృగశీర్ష హస్త పునర్వసు
శ్రవణ రేవత్యనూరాధ పుష్య
వాయునక్షత్రము ల్వాడి దేవగణములు
శతభిషాశ్లేష విశాఖ చిత్ర
జ్యేష్ఠమూలమఘధనిష్ఠ కృత్తికలివి
రాక్షసగణము లార్ద్రయును భరణి
బ్రాహ్మోత్తరోత్తరా భాద్రోత్తరాషాఢ
పూర్వత్రయంబును భువిని మనుజ
గణములగుఁగాన వైరివర్గంబు దెలిసి
యాప్తగణములతోఁ జెందినట్టివార
నిండ్లు గట్టిన శుభముల నిచ్చు నెపుడుఁ
దెలియ కెవ్వరు గట్టిన వెలయ దభవ! 97

అశ్విని, మృగశీర్ష, హస్త, పునర్వసు, శ్రవణము, రేవతి, అనూరాధ, పుష్యమి, స్వాతి ఇవి దేవగణము. శతభిషము, ఆశ్రేష, విశాఖ, చిత్త, జ్యేష్ఠ, మూల, మఖ, ధనిష్ఠ, కృత్తిక ఇవి రాక్షసగణము. ఆర్ద్ర, భరణి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర ఇవి మనుజగణము.

ఆ. దేవరాక్షసులకుఁ దీరని దుఃఖంబు
మనుజదైవతములు మధ్యమములు
దైత్యమానవునకుఁ దప్పదు మృత్యువు
సమతగణము లయిన సౌఖ్య మభవ! ౧౮

దేవగణము రాక్షసగణము గలిసిన నధిక దుఃఖము గలుగును. మనుజదేవగణములు గలిసిన మధ్యమము. దైత్యగణము మానవగణము గూడిన మృత్యువు సంప్రాప్తించును. ఏకగణము నందలి వయిన సుఖము గలుగును.

### గ్రహములవర్ణవిభాగము

తే. వృశ్చికకుళీరమీనముల్ విప్రజాతి
హరిధనుర్మేషములు క్షత్త్రియాన్వయంబు
వసుధ వృషమకరాంగనల్ వైశ్యజాతి
సౌరిది తులకుంభయుగ్మముల్ శూద్రజాతి. ౧౯

వృశ్చికము, కర్కాటకము, మీనము ఇవి బ్రాహ్మణజాతివి, ధనుర్మేష సింహములు క్షత్త్రియజాతివి. వృషభము, కన్య, మకరము ఇవి వైశ్యజాతివి. తుల, మిథునము, కుంభము ఇవి శూద్రజాతివి.

ఆ. అధికజాతివారి కధమసంగతి మేలు
అధములకును బొసఁగ దధికజాతి
సమతవర్ణమయిన సమ్మతంబగు నాల్గు
కులములకును దంపతులకుఁ బోలె. 100

అధికజాతి అధమజాతి కూడిన మేలగును. అధమజాతి కధికజాతిపొందు పొసఁగదు. ఏకజాతిలోనివానికిఁ బరస్పరము పొసఁగియుండును. గృహరాశి యేజాతిదయిన నాగృహ మాజాతివారికిఁ, దక్కువజాతులవారికిఁ దగునని తెలియునది పై జాతులవారికిఁ దగదు.

## నక్షత్రయోనికూటము

సీ. అశ్విని శతతార లశ్వము ల్స్వాతిహ
స్తలు మహిషంబులు సరవితోడ
నలరుఁ బూర్వాభాద్ర యాధనిష్ఠయు హరుల్
భరణి రేవతు లవి కరులు దలఁప
నభిజిత్తు మఱి యుత్తరాషాఢ ముంగిసల్
రోహిణిమృగశీర్ష రూఢినహులు
నరనుతాశ్రేష పునర్వసు ల్పిల్లులు
మొగి మఘ పుబ్బలు మూషకములు
సరవిఁ బూర్వాషాఢ శ్రవణంబుఁ గోతులు
పుష్యకృత్తిక లజంబులు ధరిత్రిఁ
దనర విశాఖ చిత్తలు పెద్దపులు లుత్త
రోత్తరాభాద్రలు నొగి సురభులు
మూలయు నార్ద్రయు లీలతో శునకము ల్
జ్యేష్ఠానురాధలు చెలఁగ లేళ్లు

మొదలఁ జెప్పిన ఋక్షములకు యోనులు పోతు
లవలఁ జెప్పినవెల్ల నగును బెంట్లు
హయము నెనుము హరియు హస్తి ముంగిసపాము
నోతు మూషకంబు కోఁతి మేఁక
పులియు నావు శునకమును లేడి వైరివ
ర్గంబు కూడదండ్రు కమలనాభ! 101

అశ్విని శతభిషములు గుఱ్ఱములు; స్వాతి హస్తలు ఎను ములు; పూర్వాభాద్ర ధనిష్ఠలు సింహములు. భరణి రేవతు లేనుఁగులు. అభిజి దుత్తరాషాఢలు ముంగిసలు. రోహిణి మృగ శీర్షలు సర్పములు. ఆశ్లేష పునర్వసులు పిల్లులు. మఘ పుబ్బ లెలుకలు. పూర్వాషాఢ శ్రవణములు కోఁతులు. పుష్యమి కృత్తికలు మేఁకలు. విశాఖ చిత్తలు పులులు. ఉత్తరోత్తరా భాద్ర లావులు. మూల ఆర్ద్రలు కుక్కలు. జ్యేష్ఠానురాధలు జింకలు. ఈజంటలలో మొదటిది పురుషయోని. రెండవది స్త్రీయోని యని తెలియునది. ఈజాతులలో గుఱ్ఱమునకు నెను మునకు, ఏనుగునకు సింహమునకు, ముంగిసకుఁ బాముకు, పిల్లికి నెలుకకు, కోఁతికి మేఁకకు, ఆవుకుఁ బులికి, కుక్కకు లేడికిఁ దీరనివైరము. కావున గృహనక్షత్రమునకు, గృహపతి నక్షత్ర మునకుఁ బొందియుండఁ జూచుకొని యిండ్లు కట్టుకొనవలెను.

క. గ్రహమైత్రి మహీసురులకు
మహిపతులకు గణముమైత్రి మఱి వైశ్యులకున్
విహితమగు వర్ణమైత్రియు
సహజము శూద్రులకు యోనిసంగతి కృష్ణా! 102

బ్రాహ్మణులకు గ్రహమైత్రి పొసఁగినఁ జాలును. క్షత్రియులకు గణమైత్రి పొసఁగియుండవలెను. వైశ్యులకు వర్ణమైత్రి పొసఁగియుండవలయును. శూద్రులకు యోనిపొంతనము గుదిరియుండవలెను.

### మాసక్రమ వాస్తుపురుషస్థితి

సీ. ఉర్వి భాద్రపదాశ్వయుజకార్తికంబుల
నలవాస్తు ప్రాగ్దిశఁ దలగడౌను
మార్గశీర్ష పుష్యమాఘమాసంబుల
దక్షిణాశీర్షుఁడై తనరియుండు
వరుస ఫాల్గుణచైత్రవైశాఖములయందు
బడమటి తలగడబవ్వళించు
ఘనత జ్యేష్ఠాషాఢశ్రావణంబుల
నుత్తరశీర్షుఁడై యుండు నెపుడు
వామశాయి యగుచు వర్తించు నిరతంబు
నతనిదృష్టిపథమునందు నిండ్లు
గట్టిరేని మృతియు ఘనరోగములఁ జెందు
శిరమునందు వెనుక సిరులు కృష్ణ! 103

భాద్రపదాశ్వయుజకార్తిక మాసములయందు వాస్తుపురుషుఁడు తూర్పుదిక్కున దల నుంచుకొని పరుండును. దృష్టి దక్షిణపువైపున నుండును. మార్గశీర్ష పుష్యమాఘమాసములయందు దక్షిణపుదిక్కునఁ దల నుంచుకొని పరుండును. పడమటి దృష్టిపాలును. ఫాల్గునచైత్రవైశాఖములయందుఁ బడమటఁ దల నుంచుకొని పరుండును. దృష్టి ఉత్తరమునకుఁ బోవును. జ్యేష్ఠాషాఢ శ్రావణమాసములయం దుత్తరపు దిక్కునఁ దల

నుంచుకొని పరుండును. దృష్టి తూరుపునకుఁ జూచుచుండును. ఏ దిక్కునఁ దలనుంచుకొనినను ఎడమవైపున కొత్తిగిలి పరుండును. కావున నతనిదృష్టి పాలుప్రదేశమునను, కాళ్లవైపునను ఇండ్లు గట్టిన మృత్యువు, రోగము సంప్రాప్తించును. తలవైపునను వెనుక వైపునను గట్టినయెడల సంపదలు గలుగును.

సీ. కన్యను దుల వృశ్చికమునందుఁ దూరుపు
శిరముగ నావాస్తుపురుషుఁ డుండు
మఱి ధనుర్మకరకుంభములందు దక్షిణ
మౌళియై నిద్ర నెమ్మది వసించు
మేటిగా నామీన మేషవృషంబులఁ
బడమరతలగడఁ బవ్వళించు
గణుతింప మిథునకర్కటసింహములయందు
నుత్తరశీర్షుఁడై యుండు నెపుడు
ఎడమప్రక్కఁ గ్రిందుపడఁగఁ బర్యంకుఁడై
దృష్టిపదములందు దీటుకొల్పు
నిట్టిలక్షణంబు లెఱిఁగి గృహంబులు
గట్టఁ గార్యసిద్ధి కమలనాభ ! 104

వాస్తుపురుషుఁడు కన్యా, తుల, వృశ్చిక సంక్రాంతుల యందుఁ దూరుపున తలనుంచుకొని యెడమప్రక్కకుఁ దిరిగి పడమరఁ జూచుచుఁ బరుండును. ధనుర్మకరకుంభసంక్రాంతుల యందు దక్షిణపుఁ దలనుంచుకొని ఎడమప్రక్కకొత్తిగిలి యుత్తరమును జూచుచుఁ బరుండును. మీన మేష వృషభ సంక్రాంతులయందుఁ బడమరతలగాఁ దూరుప్రక్కఁజూచుచు నెడమవైపునకుఁ దిరిగి పవ్వళించును. మిథునకర్కటకసింహ సంక్రాం

తులయం దుత్తరపుదిక్కునఁ దలనిడి వామభాగమునకు దిరిగి దక్షిణమును గాంచుచు శయనించును. దృష్టి అతని పాదముల పయి నుండి ఆయాదిక్కునకు బ్రసరించును. (గాన నతని పాదము లున్నదిక్కుల వాకిలి నేరుపరుచుట శ్రేయము.)

### వాస్తుపురుషుని నాభిస్థాన నిర్ణయము

తే. భవనమానంబుఁ దొమ్మిదిపాళ్లు చేసి
నడిమిభాగంబు మూఁడునేర్పడఁగఁ జేసి
పాదములవైపునకు రెండుపాళ్లు విడువ
నిలుచుభాగంబు నాభియౌ నియతిఁ గృష్ణ ! 105

ఇంటియొక్క నిడివిని గొలిచి దానిని దొమ్మిదిపాళ్లుచేసి, అందు నడిమిపాలిని మఱల మూఁడుగ భాగించి వానిలో రెండు పాళ్లను బాదముల వైపునకుఁ ద్రోయ నిలిచిన మూఁడవపాలు వాస్తుపురుషుని నాభిస్థాన మగును.

### ఘాతఫల నిర్ణయము

ఆ. తలను ఘాత మయినఁ దండ్రి మృతుం డగుఁ
బాదయుగళియందుఁ బత్ని నొచ్చు
ముఖము వీఁపులందు మొగి రోగిభయము లౌఁ
గుక్షియందు సిరులు గూర్చుఁ గృష్ణ! 106

వాస్తుపురుషుని శిరముపయిఁ ద్రవ్వినయెడలఁ దండ్రి మరణించును. పాదములపయి ద్రవ్విన భార్యకుఁ జేటగును. ముఖమును, వీఁపును ద్రవ్విన, రోగము భయము గల్గును. కడుపు పయిఁ ద్రవ్వినయెడల సంపదలు గలుగును.

క. పంచాంగశుద్ధతిథిని ను
దంచితగతిఁ దనకుఁ జంద్రతారాబలముల్
గాంచి పతి స్థపతినిఁ బూ
జించి వనంబునకుఁ బనుపఁ జెన్నగుఁ గృష్ణా! 107

తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము లెస్సగా నున్న దినమున గృహపతి తనకుఁ జంద్రబలము, తారాబలము సరిగాఁ జూచుకొని వడ్రంగినిఁ బూజించి యిండ్లు గట్టుటకు దారువులను దెచ్చుటకయి వనమునకుఁ బంపవలెను.

తే. బహుళపంచమి మొదలుగాఁ బరఁగ నైదు
దినములను ఖండితములైన ఘనకుజములు
పుప్పి గొనవండ్రు రోహిణి యొప్ప నేనిఁ
దుమ్మ లేనియుఁ బుచ్చ నద్భుతము కృష్ణ! 108

బహుళపంచమి మొదలుకొని యైదుదినములయందు నఱికిన వృక్షములు పుచ్చవు. ఆ దినములయందు రోహిణినక్షత్రము కూడిన దినము శ్రేష్ఠము. అప్పుడు నఱికిన తుమ్మచెట్లయినను పుప్పిని జెందవు.

తే. ఒనరఁ గృత్తికయం దర్కుఁ డుండెనేని
శ్రవణనక్షత్రమునఁ గుంభరాశి శుక్రుఁ
డుండెనేనిఁ దరుచ్ఛేద మొప్పదండ్రు
మున్ను నఱికినవైనఁ దేఁ బొసఁగ దధిప! 109

కృత్తికానక్షత్రమున రవి యున్నపుడును శ్రవణ నక్షత్రమునను, కుంభరాశిని శుక్రుఁ డున్నపుడును వృక్షములను నఱుకఁజనదు. మున్ను నఱికినవానినిఁగూడఁ గొనిరాఁగూడదు.

తే. శ్రవణపూర్వక పంచనక్షత్రములను
నిల మఘాదిగ నైదుతారలను గూడి
నలినరిపుఁ డున్నవృక్షముల్ నఱకరాదు
మున్ను నఱికినవైనఁ దేఁబోసఁగ దభవ! 110

శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త అను నినక్షత్రముల యందుఁ జంద్రుఁ డుండుకాలమున వృక్షములను ఖండింపఁ గూడదు. అంతకుఁబూర్వము ఖండించిన వానినేనియు నాదినములఁ గొనిరాఁగూడదు.

## వృక్షనక్షత్రములు

సీ. అశ్వినిమొదలుగా నగుసప్తవింశతి
తారలవృక్షముల్ దనరు ముష్టి
యుసిరిక మేఁడి పెంపొందు నేరెడు చంద్ర
వనచంద్ర వెదురును మొనయు రావి
నాగకేసరము చెన్నగు మఱ్ఱి మోదుగు
జువ్వి యంబాళంబు సొంపుతోడ
వెలయ మారేడు మద్ది ములువేము పొగడయు
నీరుమద్దియు వేగి నిమ్మ పనస
జిల్లేడును జమ్మికానుగు చెల్వమైన
మామిడియు వేము నిప్పయు మఱఁ దలంచు
నరులు దమతారకుజములు నఱుకరాదు
సలలితంబుగఁ బూజింపవలయుఁ గృష్ణ! 111

ముష్టికి నశ్విని, ఉసిరికకు భరణి, అత్తికి కృత్తిక, నేరేడునకు రోహిణి, చంద్రకు మృగశీర్ష, వనచంద్ర కార్ద్ర,

వెదురునకుఁ బునర్వసు, రావికిఁ బుష్యమి, నాగకేసరమున
కాశ్లేష, మఱ్ఱికి మఖ, మోదుగునకుఁ బుబ్బ, జువ్వికి నుత్తర,
అంబాళమునకు హస్త, మారేడునకుఁ జిత్త, మద్దికి స్వాతి,
ములువేమునకు విశాఖ, పొగడ కనూరాధ, నీరుమద్దికి జ్యేష్ఠ,
వేగికి మూల, నెమ్మికిఁ బూర్వాషాఢ, పనస కుత్తరాషాఢ, జిల్లే
డునకు శ్రవణము, జమ్మికి ధనిష్ఠ, కానుగునకు శతభిషము, మామి
డికిఁ బూర్వాభాద్ర, వేపకు నుత్తరాభాద్ర, ఇప్పకు రేవతి
నక్షత్రములు కావున నిల్లుకట్టుకొనునాతఁడు తన నక్షత్రము
యొక్క వృక్షమును నఱుకరాదు. వానినిఁ బూజింపవలెను.

క. ధరణిఁ గృహపతితారకు
నరినక్షత్రద్రుమంబు నరియోనికుజం
బరుదుగ యోగ్యము గా వవి
పరిహరణీయములు శాస్త్రపద్ధతిఁ గృష్ణా! 112

ఇల్లుకట్టుకొనునాతని నక్షత్రమునకు శత్రునక్షత్రము
యొక్క వృక్షము పనికిరాదు. అనఁగా అశ్విని నీరుమద్ది, భర
ణికిఁ బొగడ, కృత్తికకు ములువేము, రోహిణికి మద్ది, మఖకు
ఇప్ప, పుబ్బకు వేప, ఉత్తరకు మామిడి, హస్తకు కానుగు,
మూలకు నాగకేసరము, పూర్వాషాఢకు రావి, ఉత్తరాషాఢకు
వెదురు, శ్రవణమునకు వసచంద్ర, మృగశీర్షకు మారేడు,
చిత్తకు జమ్మి, ధనిష్ఠకు చంద్ర శత్రువృక్షములు స్వాతిహస్తలకు
ముష్టికానుగులు, భరణిరేవతులకు మామిడిజమ్ములు, రోహిణి
మృగశీర్షలకు పనస, మఘపుబ్బలకు నాగకేసరము వెదురు,
పుష్యమికృత్తికలకు నెమ్మిజిల్లేడులు, ఉత్తర ఉత్తరాభాద్రలకు

ములు వేము మారేడులు, జ్యేష్ఠానురాధలకు వేగివనచంద్రలు శత్రుయోనులు. ఇవి పనికిరావు. *

ఉ. తేనెలు పెట్టువృక్షములును, దేవరవృక్షములు, రచ్చవృక్షము
లున్, మౌనులు నిల్చువృక్షము, లోరవృక్షములు, మూలిక
లున్న వృక్షములున్, నేసుగుఁ గట్టువృక్షములును నెక్కువ
తీవలు చుట్టువృక్షములున్, మానుగ వీర్లవృక్షములును మంచివి
కావు గృహంబుఁ గట్టఁగన్. 113

తేనెపెరలు పెట్టినచెట్లును, దేవతలపేరున నున్నవృక్షములును, పదిమంది క్రిందఁగూర్చుండి వ్యవహారములుచేయు వృక్షములును, మునుల కావాసములగు వృక్షములును, ఒండొంటి నొరసికొనుచున్న చెట్లును, పైన మూలికలు మొలచియున్న

* ఒకవ్రాఁతమాతృకయం దీచోట నీక్రిందిపద్య మున్నది.—

సీ. పెడపట్టైయెనవి (పెరపట్టులైనవి) పెఱకిరాలినయవి
నిలఁబట్టివైనవి సీల్ల దరివి
పూచికా చెడునవి పుప్పిపట్టినయవి
గుల్మవక్రంబులు గూళ్లుగలవి
గ్రంథులుగలయవి గాలిచేఁబడినవి
తెలియరానట్టివి తెగులు (తొలుగులు) గలవి
పాడిండ్లలోనివి పాలున్న యవియును
పిడుగులుపడినవి పెనఁచినవియుఁ

బథికులకు నుండు నీడయై ప్రబలినవియు
భూతనిలయంబు పుట్టపైఁ బుట్టినవియు
నరదగంబు లైనట్టి యవనిజములు
గొఱవ రా వందు రార్యులు గోపతిలక!

మ్రాఁకులును, ఏనుఁగులను గట్టివేయు వృక్షములును, తీఁగలు చుట్టుకొనియున్న చెట్లును, క్రింద వీరులప్రతిమలను నిలిపిన మ్రాఁకులును ఇండ్లుకట్టుటకుఁ బనికిరావు.

సీ. తాండ్ర గుంపెనచిల్ల తపసిబూరుగువేఁగి
　　　జీడి వావిలి ముష్టి మేఁడి తాఁడి
అగిసె యేరండంబు నారె పచ్చారెయు
　　　రేల పొలికిపల్ల రేను చిగిరె
మజ్జి మోదుగు జువ్వి మామిడి జెము డిప్ప
　　　చెన్నంగి యుసిరిక చింత వెలఁగ
ఊడిగ సోమింద యుప్పి తంగెడు నేలు
　　　మద్దిరావులు పెద్దమాను వేము
నన్యఖండితంబు లారయ శల్యంబు
లెలమి దోరెములును గలవి వలదు
ఖదిర మొకటి దక్కఁ గంటకద్రుమములు
నింధితములు శాస్త్రనియతిఁ గృష్ణ! 114

తాండ్ర, గుంపెన, చిల్ల, తబిసి, బూరుగు, వేగి, జీడి, వావిలి, ముష్టి, అత్తి, తాఁడి, అగిసె, ఆముదపుఁజెట్టు, ఆరె, పచ్చారె, రేల, పొలికి, పల్లరేను, చిగిరె, మజ్జి, మోదుగు, జువ్వి, మామిడి, జెముడు, ఇప్ప, చెన్నంగి, ఉసిరిక, చింత, వెలఁగ, ఊడుగు, సోమింద, ఉప్పి, తంగేడు, ఏలుమద్ది, రావి, పెద్దమ్రాను, వేఁప, పరులునఱికినవి, పట్టలూడినవి, దోనెలు వాలినవి, చండ్ర తప్పఁ దక్కినముండ్లుగలమ్రాఁకులు నిండ్లకుఁ బనికిరావు.

ఆ. మ్రానుఁ గాటువెట్ట మాంజిష్ఠ కలరవ
తైలగుడపిశంగనీలకపిల
కాంతులున్నఁ గప్పగౌళితేలును ఊయి
యుడుముఁ బాము నెలుక నుండుఁ దగవు. 115

వృక్షమును ఖండించుటకయి కాటువెట్టినపుడు మాంజిష్ఠ వర్ణము గనుపించునేనిఁ గప్పయు, కలరవ (చిత్ర) వర్ణము గనుపించునేని బల్లియు; తైలవర్ణము గనుపించునేనిఁ దేలును, బెల్లపు రంగు గనుపించునేని ఊయియు, పింగళవర్ణము గనుపించునేని నుడుమును, నీలవర్ణము గనుపించునేనిఁ బామును, కపిలవర్ణము గనుపించునేని నెలుకయు నుండును. ఇట్టి మ్రాఁకులతో నిండ్లు గట్టరాదు.

క. భూజములు నఱకుతఱి వి
భ్రాజితముగ దక్షిణమునఁ బశ్చిమమున బల్
రోజుచుఁ బడినను గీడగు
రాజితముగఁ దూర్పు నుత్తరముల సుఖంబుల్. 116

నఱికిన చెట్లు దక్షిణమునకుఁగాని పడమటకుఁగాని, ధ్వని చేయుచుఁ బడునేని చెఱుపు గలుగును. తూర్పునకుఁగాని, ఉత్తరమునకుఁగాని వ్రాలినయెడల మేలగును.

## గ్రాహ్యములగు వృక్షములు

ఆ. చంద్రబట్టకడిమి జందనంబినుమద్ది
వెఁమ (గ) వేఁప (యేపి) టేకు వెదురు వ (కొ)డిస
కొన్గు రుద్రగణము కడిమి మ్రొక్కము బిళ్లు
నిట్టబారుసమితి యిండ్ల కలరు. 117

చంద్ర, బట్టకడిమి, రుద్రగణము, చందనము, ఇనుమద్ది, వెలమ (గ); వేప (ఏఁపి), టేకు, వెదురు, వడిస, కొడిసె - కొడిది, కానుగు, రుద్రగణము, కడిమి, మొక్కము, బిల్లు ఈవృక్షము లిండ్లుకట్టుటకుఁ బనికివచ్చును.

## శంకు స్థాపనము

క. మొదలఁ శంకుస్థాపన
విదితంబుగఁ జేసి వలయువేళల మనుజుల్
విదితముగ నిండ్లుగట్టినఁ
దుది నేదోషములు నెపుడు దొరకొనవెందుఁ. 118

ఇండ్లు కట్టఁగోరువారు తొలుదొలుత శుభలగ్నమున శంకువును స్థాపింపవలయును. తరువాత నచ్చట నిండ్లను గట్టవలెను. అట్లయిన దోషము లెవ్వియుఁ బొసఁగవు.

తే. శంకుసంస్థాపనము సేయుసమయ మెన్న
శుక్లపక్షము సర్వదా శోభనంబు
నంద రిక్తలు దర్శయు నష్టకరులు
సౌమ్యగురు శుక్రవారముల్ సౌఖ్యదములు. 119

శంకువును స్థాపించుటకు శుక్లపక్షము మంచిది (కృష్ణపక్షము మంచిది కాదు.) నందతిథు లయిన పాడ్యమి షష్ఠి ఏకాదశి, రిక్తతిథులయిన చవితి, నవమి, చతుర్దశి ఈ యాఱుతిథుల యందు, నమావాస్యయందును శంకువును స్థాపింపఁజనదు. బుధ గురుశుక్రవారములు సౌఖ్యకరములు.

తే. శతభిషక్ఛ్రవణోత్తరాషాఢహస్త
రేవతిస్వాతిరోహిణీమృగశిరాశ్వి

చిత్రపుష్యోత్తరాదితిమిత్రవసువు
లలరు నిర్వేధలై శంకు నిలుపుతఱిని. 120

శతభిషము, శ్రవణము, ఉత్తరాషాఢ, హస్త, రేవతి, స్వాతి, రోహిణి, మృగశీర్ష, అశ్విని, చిత్త్ర, పుష్యమి, ఉత్తర, పునర్వసు, అనూరాధ, ధనిష్ఠ, ఈ పదునైదు నక్షత్రములయందు శంకుస్థాపనము శుభకరము. ఈనక్షత్రములు నిర్వేధలు.

తే. తలఁప దగ్ధజ్వలితధూమితములఁ దెలిసి
వ్యాధి నిర్జీవ జీవపర్యాయ మెఱిఁగి
మంచినక్షత్రములు విచారించి శంకు
నిలుపవలయును శాస్త్రోక్తనియతిఁ గృష్ణ! 121

దగ్ధతారలు. జ్వలితతారలు, ధూమితతారలు, రోగతారలు, నిర్జీవతారలు, జీవతారలు అను నీ భేదములను జక్కఁగాఁ దెలిసికొని మంచి నక్షత్రములయందు, అనఁగా జీవనక్షత్రముల యందు శంకుస్థాపనము చేయవలెను.

### దగ్ధజ్వలితధూమితతారలు

తే. క్రూర ఖేటాదులకు ముక్తతారకములు
క్రూరఖేటము లున్నట్టి తారకములు
క్రూరులకు ముందఱను నిల్చుదారకములు
దనరు దగ్ధజ్వలితధూమితములు కృష్ణ! 122

క్రూరగ్రహము లుండి విడిచిపెట్టిన నక్షత్రములు దగ్ధనక్షత్రములు, క్రూరగ్రహము లున్ననక్షత్రములు జ్వలితనక్షత్రములు, వానికి ముందు నక్షత్రములు ధూమితనక్షత్రములు.

### జీవనిర్జీవరోగతారలు

క. కమలహితుఁ డున్న నక్ష
త్రము మొదలుగ సప్తసంఖ్యతారలు నిర్జీ
వములగుఁ బండ్రెండు సజీ
వములగుఁ దొమ్మిదియు రోగవంతము లభవా! 123

సూర్యుఁ డున్న నక్షత్రము మొదలు ఏడు నిర్జీవతారలు. తరువాతి పండ్రెండు సజీవములు, ఆపలి తొమ్మిది రోగతారకలు.

తే. దగ్ధముల దగ్ధ మగు, జ్వలితములఁ బోరు,
ధూమితంబులఁ లేమిఁ జెందును, రుజార్తి
వ్యాధితారల, నిర్జీవభములఁ గీడు
జీవతారల సుఖము లక్ష్మీనివాస! 124

దగ్ధనక్షత్రములయందు శంకుస్థాపనము చేసినయెడల నిండ్లు కాలిపోవును. జ్వలితనక్షత్రములం దయినఁ గలహము గలిగి యుండును. ధూమితములం దయిన దారిద్ర్యము సంభవించును. రోగనక్షత్రములం దయిన వ్యాధిబాధ యగును. నిర్జీవనక్షత్రములందయిన చెఱుపు గలుగును. జీవతారకములం దయిన సౌఖ్యములు చేకూరును.

### గృహకర్ణికా చక్రము

సీ. లింగత్రయాకృతి లిఖియించి యడ్డరే
ఖలు నాల్గునందిడి క్రమముతోడ
అశ్వినాదిగఁ దారలన్ని యుండఁగ వ్రాసి
యుడురాజు నేరేఖ నుండునందు

నాదిత్యుఁ డుండిన నగ్నిభయంబగు
మేదినీసుతుఁ డున్న మృత్యుభయము
బుధుఁడున్న రోగముల్ పుట్టించు గురుఁడున్న
భాగ్యహీనులఁజేయు భార్గవుండు
కలహ మొదవించు శనియుఁ దస్కరభయంబు
రాహువున్నను బతికిని దేహపీడ
చలనమును జేయుఁ గేతువు సంతతంబు
వెలయు గృహకర్ణికాచక్ర ఫలము లభవ! 125

గృహకర్ణికాచక్రము




పైయట్లు నిలువుగ మూఁడులింగములు గీచి వానిపయి నడ్డుగ నాలుగు రేకలు గీచి ఎడమప్రక్కలింగము మొదటనున్న రేకనుండి ఒక్కొక్క రేకమీఁద అశ్విని మొదలయిన నక్షత్రములను వరుస వ్రాయవలెను. అపు డొక్కొక్కలింగమున తొమ్మిది నక్షత్రము లుండును. ఇది గృహకర్ణికాచక్ర మనఁబడును. ఇఁక ఫలము. చంద్రుఁడుగలనక్షత్ర మున్న రేకపయి గలనక్షత్రములలో దేనియందేని సూర్యుఁ డున్నయెడల నిండ్లు తగులఁబడిపోవును; అంగారకుఁ డున్నఁ జావుగలుగును; బుధుఁ డున్న

రోగములుగలుగును; గురువున్న భాగ్యహాని యగును; శుక్రుం డున్నఁ బోరాటము పుట్టును; శనియున్న దొంగలభయము గలుగును. రాహువున్న గృహపతికి దేహపీడ యగును; కేతువున్న సంచలనము గలుగును.

తే. పొసఁగ నీచక్రమున లెక్కిపోవుతార
కములలో నూర్ధ్వముఖతారకము శుభమ్ము
మొనసి దిగివచ్చునయ్యధోముఖము లయిన
తారకలు నిందితంబులు దానవారి! 126

ఈచక్రమున లింగములతలలకు ఎక్కుక్రమమున నున్న తారకలు-అనఁగా అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ ఈనక్షత్రము లూర్ధ్వముఖ నక్షత్రములు. ఇవి శుభకరములు. తక్కినవి అధోముఖనక్షత్రములు. అనఁగా దిగుక్రమమున నున్నవి. ఇవి అశుభదములు.

### ఘటికానిర్ణయము

సీ. తననీడఁ బదములఁ దగఁ గొల్చి గిరిసంఖ్య
నందులోఁ గూడి మేషాదిగాఁగ
గన్యపర్యంతంబు గరిమ నొక్కటి డించి
క్రమముతోఁ గడమసంక్రమణములకుఁ
బురవార్ధి శరబాణశరధివై శ్వానర
సంఖ్యలు డించి శేషంబు నిలిపి
మొగి నహఃపరిమాణమున సగం బద్రిసం
ఖ్యనుఁ బెంచి మున్నుంచినట్టిరాశి

చేత భాగింప గడియలరీతివచ్చుఁ
బరగు మధ్యాహ్నమునకుఁ బూర్వంబు గతము
ప్రొద్దు దిరిగిన దినశేషమునకుఁ దనరు
గడియ లీరీతిఁ గననగుఁ గమలనాభ! 127

మనుజుఁడు సరిగా నిలుచుండి నేలపయిఁ బొడసిన తన నీడ పొడవును దనపాదములతోఁ గొలువఁగా వచ్చిన అడుగుల లెక్కతో నేడునుగూర్చి మేషము, వృషభము మిథునము, కట కము, సింహము, కన్య, వీని కొక్కొక్కటి లెక్కను త్రోసివైచి మిగిలినదానినుండి, తులకు మూఁడు, వృశ్చికమునకు నాలుగు, ధనస్సున కయిదు, మకరమున కయిదు, కుంభమునకు నాలుగు, మీనమునకు మూఁడు త్రోసివేయవలెను. ఆ సంఖ్య నట్లుంచు కొని, నాఁటియహఃప్రమాణమును సగముచేసి దాని నేడుతో గుణించివచ్చిన లబ్ధమును ఉంచుకొనిన సంఖ్యతో భాగింపఁగా వచ్చినది గడియలసంఖ్య యగును.

## లగ్నపరిమాణము

తే. నాల్గుగడియలు మేషమీనములు నాల్గు
నరయు వృషభకుంభలగ్నము లయిదుఁ బాతి
కయును మృగయుగ్మతుల కన్య లయిదు నరయు
హరి ధనుఃకర్కిటంబు లనుదినంబు. 128

మేషమునకు నాలుగుగడియలు, వృషభమునకు నాలుగు నరగడియలు, మిథునమునకు నయిదుంబాతికగడియలు, కర్కా టకమునకు నయిదునరగడియలు, సింహమునకు నయిదునర, కన్య కయిదుంబాతికగడియలు, తుల కయిదుంబాతికగడియలు,

వృశ్చికమున కయిదు నరగడియలు, ధనుస్సున కయిదు నరగడియలు, మకరమునకు నయిదుంబావతికగడియలు, కుంభమునకు నాలుగు నరగడియలు, మీనమునకు నాలుగుగడియలు.

ఆ. మేషకర్కితౌలి మృగములు చరములు
గోపసింహకీటకుంభములును
స్థిరము లనఁగ బరగు ద్విస్వభావంబులు
మిథున మింతి విల్లు మీన మభవ! 129

మేషము, కర్కటకము, తుల, మకరము ఇవి చరలగ్నములు; వృషభము, సింహము, వృశ్చికము, కుంభము ఇవి స్థిరలగ్నములు; మిథునము, కన్య, ధనుస్సు, మీనము ఇవి చరస్థిరస్వభావములు గలవి.

సీ. భాస్కరు డాదిన ష్గ్రహంబులకును.
నజవృషమకరంబు లంగనయును
గర్కటఝషతులల్ గ్రమ మొప్ప నుచ్చలు
పరువడి నిందులోఁ బరియఃమూఁడు
నిర్వ దెన్మిది పదునేను నై దిర్వదే
డిర్వదిభాగలు నుర్విఁ దెలియఁ
బరమోచ్చపంజ్ఞలఁ బరగుఁ దదుచ్చల
కేపఁగు సప్తమరాసు లెంచ నీచ
లగును సింహంబు వృషభంబు నజము కన్య
విల్లు దులయును గలశంబు విశ్రుతముగఁ
దనరు మూలత్రికోణాభిధానములను
సకలసిద్ధాంతశాస్త్రార్థసరణిఁ గృష్ణ! 130

సూర్యున కుచ్చస్థానము మేషము, లగ్నమాద్యంతము ముప్పదిభాగములు. అందులో మొదటి పదిభాగములు పర మోచ్చము. మేషమున కేడవ దయిన తుల నీచము. మూల త్రికోణము సింహము. చంద్రునకు వృషభ ముచ్చము. ఆదు మూఁడుభాగములు పరమోచ్చము. ఏడవదగు వృశ్చికము నీచము. మూలత్రికోణము వృషభము. అంగారకునకు మకర ముచ్చము. అం దిరువదియెనిమిది భాగములు పరమోచ్చము. ఏడవదగు కర్కటకము నీచము. మూలత్రికోణము మేషము. బుధున కుచ్చము కన్య. ఇందుఁ బదునయిదుభాగములు పర మోచ్చము. దీని కేడవదియగు మీనము నీచము. మూలత్రికో ణము కన్య. గురువున కుచ్చము కర్కటకము. ఇందైదు భాగ ములు పరమోచ్చము. ఈరాశి కేడవదియగు మకరము నీచము. మూలత్రికోణము విల్లు. శుక్రున కుచ్చము మీనము. ఈమీన ములో నిరువదియేడు భాగములు పరమోచ్చము. దీని కేడవది యగు కన్య నీచము, మూలత్రికోణము తుల. శని కుచ్చము తుల. అం దిరువదిభాగములు పరమోచ్చము. దీని కేడవది యగు మేషము నీచము. మూలత్రికోణము కుంభము.

## కేంద్రత్రికోణనిర్ణయములు

ఆ. పదియు నేడు నాల్గు పదపడి లగ్నంబు
కేంద్రసంజ్ఞ లయ్యెఁ ఖేటములకు
తెలియఁ దొమ్మిదైదు చెలఁగి త్రికోణంబు
లనఁగవలయు ధరణి నబ్జనాభ ! 131

లగ్నమునకు ౪, ౭, ౧౦ స్థానములును, లగ్నమును

కేంద్రసంజ్ఞగలవి యగును. ౫, ౯ స్థానములు, త్రికోణసంజ్ఞ గలవి యగును.

## గ్రహదృష్టినిర్ణయము

తే. పదిట మూఁడవచోటను బాదదృష్టి
యర్ధదృష్టియగుఁ దొమ్మిది నైదుచోట్ల
నాల్గిటను నెన్మిదిటను నెన్నఁగఁ ద్రిపాద
దృష్టి సప్తమమునఁ బూర్ణదృష్టి కృష్ణ! 132

గ్రహములకుఁ దాము నివసించు రాశికి 3, ౧౦ స్థానములయందుఁ బాదదృష్టి; ౫, ౯ - స్థానములయం దర్ధదృష్టి; ౪, ౮ స్థానములయందుఁ ద్రిపాదదృష్టి; ౭-స్థానమందుఁ బూర్ణదృష్టి, శుభగ్రహములదృష్టి శుభమును, పాపగ్రహములదృష్టి కీడును గలుగఁజేయును.

## గ్రహదృష్టిబలనిర్ణయము

ఆ. పాదదృష్టి శనికి బలవంత మైయుండు
నర్ధదృష్టి గురున కధిక బలము
బలము మూఁడుపాదములదృష్టి కుజునకు
నితరులకును బూర్ణదృష్టి బలము. 133

పాదదృష్టియందు శని బలవంతుఁడు, అర్ధదృష్టియందు గురుఁడు బలవంతుఁడు, త్రిపాదదృష్టియం దంగారకుఁడు బలవంతుఁడు. తక్కినగ్రహములన్నియుఁ బూర్ణదృష్టియందు బలము గలవి.

## గురుశుక్రచంద్రులకు బాల్యవృద్ధత్వనిర్ణయము

క. రమణా గురునకు నుదయా
స్తమయములన్ బాలవృద్ధతలు నొకపక్షం

బమరుఁ శశికిని వృద్ధ
త్వము త్రిదినముల దదర్థతఁ బాల్యమగుఁ. 134

బృహస్పతి కుదయకాలము మొదలు ౧౫ దినములవఱకును బాల్యము. అస్తమించుటకుఁ బూర్వము పదునైదుదినములు వృద్ధత్వము గలుగును. చంద్రునకు మాసాంతమందు మూఁడుదినములు వృద్ధత్వము, మాసాదియందు మూఁడుదినములు బాల్యమును.

తే. ఉశనునకు నెన్నఁ బ్రాక్పశ్చిమోదయములఁ
బాల్య మగుమూఁడుదినములు పదియు నస్త
మయము వేళను వృద్ధత్వ మగును పక్ష
మైదుదినములు మునిమతం బబ్జనాభ ! 135

శుక్రునకుఁ దూర్పున నుదయ మగుచో మూఁడుదినములును, పశ్చిమమున నుదయమగుచోఁ బదిదినములును బాల్యము. తూర్పున నస్తమించెనేని యస్తమించుటకుఁ బూర్వము పదునైదు దినములును, పశ్చిమమున నస్తమించెనేని యంతకుఁ బూర్వ మైదు దినములును వృద్ధత్వము.

## లగ్ననిర్ణయము

తే. క్రూరు లాఱిట మూఁటను జేరియున్న
శుభులు సూచిన నుండిన సూర్యభౌమ
లగ్నవర్గంబు లెడలించి లలిఁ జరములు
వదల స్థిరములు ద్విస్వభావములు మేలు. 136

క్రూరగ్రహములు లగ్నమునకు నాఱింటను మూఁడింటను నుండినను, సింహావృశ్చికములను శుభగ్రహములు జూచుచుండి

నను, వానియందున్నను గీడుకలుగును. స్థిరములును చరములును పనికిరావు. ద్విస్వభావములు మేలు గూర్చును.

## లగ్నగ్రహసంపత్తి

సీ. పాపగ్రహంబులు పదునొకంటను నాఱి
టను మూఁట నుండినఁ దనరు శుభము
అవి రెంటఁ గేంద్రంబులందుఁ ద్రికోణంబు
లందును నుండినఁ జెందుఁ గీడు
తెలియంగ సౌమ్యులు ద్విత్రికేంద్రంబుల
భవబాణనవముల భద్ర మగును
అష్టమవ్యయముల నమరదే గ్రహమున్న
శుభులు లగ్నము లెస్సఁ జూడ మేలు
మఱియు నుచ్చలందు మైత్రరాసులయందు
నొరిది స్వాలయముల సూర్యుఁ డాది
గ్రహములెల్ల శుభముఁ గల్పించుఁ గర్తను
నుచితమైనచోట నున్నఁ గృష్ణ! 137

పాపగ్రహములు లగ్నమునకు ౩, ౬, ౧౧-గృహముల యందుండిన మేలుగలుగును. లగ్నమునకు రెంటను, కేంద్రములందును, త్రికోణములందును నుండినఁ గీడుగూర్చును. శుభగ్రహములు లగ్నమునకు రెంటను, మూఁటను, కేంద్రములందును ౧౧, ౬. ౫-గృహములయందును నుండిరేని శుభ మొనఁగూడును. ఏగ్రహములును ౮, ౧౨ గృహములయం దుండరాదు. శుభగ్రహములు లగ్నమునుజూచిన మేలు. ఉచ్చ మిత్ర స్వక్షేత్రములయందు సూర్యాదిగ్రహములు తగినస్థలములయందుండినఁ గర్తను మేలు గలుగును.

## శంకు స్థాపన స్తంభ ప్రతిష్ఠాసమయ ఫలము

తే. శంకు సంస్థాపన స్తంభసంగతులకు
మొదటిజా ముత్తమము రెంట ముదము, మూఁట
నధమమగు నాల్గిటను సంధ్యలందు రాత్రు
లందు నింద్యము వాస్తుసిద్ధాంత మభవ! 138

శంకుస్థాపన జేయుటకును, స్తంభప్రతిష్ఠను జేయుటకును మొదటి జాము శ్రేష్ఠము; రెండవ యామము సంతోషమును గూర్చును; మూఁడవయామ మధమము; నాలుగవ యామము నను, సంధ్యాకాలములందును, రాత్రులందును శంకుస్థాపన స్తంభ ప్రతిష్ఠలను జేయఁగూడదు.

## శంకుదారు లక్షణము

తే. చందనము మద్ది కాన్గు శ్రీచందనంబు
అగరు వర్జునకాంచన మరిశె టేకు
కొడిసె వెదు రేపె మారేడు కడపమేఁడి
చంద్ర మొదలగుదారువు ల్శంకులభవ. 139

చందనము, మద్ది, కానుగు, శ్రీచందనము, అగరు, దేవ కాంచనము, అరిశె, టేకు, కొడిసె, వెదురు, వేప, మారేడు, అత్తి, చంద్ర అను నీదారువులు శంకునకు మంచివి.

## శంకుదారు ప్రమాణ నిర్ణయము

చ. అరయ షడంగుళంబు వలనై తగదారువు శంకువున్నతం
బిరువదినాల్గు భూసురుల కిర్వదిమూఁడు నృపాలజాతికిన్
బరఁగుఁ బదాఱు వైశ్యులకు భాస్కరసంఖ్య చతుర్థజాతికిన్
మఱియువితస్తిమాత్రము సమస్తజనంబులకున్ శుభంబజా!

ఆఱంగుళములవలయము, ఇరువదినాలు గంగుళములు పొడవుగలదారువు బ్రాహ్మణుల కుచితము. ఇరువదిమూఁ డంగుళముల పొడవుగలదారువు క్షత్రియులకు శ్రేష్ఠము. పదునాఱంగుళములదారువు వైశ్యులకు మంచివి. పండ్రెండంగుళముల దారువు శూద్రులకుఁ దగినది పండ్రెండంగుళములదారువు ఎల్లరకును శుభప్రదము.

## శంకు నిర్మాణము

చ. తరువులలోన దోషరహితం బగుదారువు శంకొనర్పఁగాఁ
బరఁగు సమానసంఖ్యను త్రిభాగముగాఁ గనుపట్టిపాళ్లలో
నరయఁగ మూల మెన్నఁ జతురస్రము మధ్యమ మెన్నిదం
చులుగ, సరవిగ నగ్రభాగము వెసం దగు లింగమురీతి
మాధవా! 141

మునుపు చెప్పినదారువులలో నిర్దోషము లగువానినిఁ దెచ్చి మూఁడు సమభాగములను గుర్తించి మొదటిభాగమును చౌకముగాను, రెండవభాగము నెనిమిదంచులు గలదిగను, మూఁడవభాగమును లింగాకారముగను జెక్కవలయును.

## చెక్కుపాటు లక్షణము

సీ. సుముహూర్తమునఁ బరిశుద్ధుఁడై వడ్రంగి
ధర్మదేవతను బ్రార్థనముచేసి
ప్రాగగ్రమున మ్రానుఁబరపి చెక్కఁగఁ జెక్కు
పాటున ఫలములు తేటపరతు
చెక్కినఁ జెక్కఁగాఁ జెక్కఁగాఁ బడినపా
టున నున్న శుభము కీ డెనయు నెగసి

పడెనేని వెలకిలఁ బడినచో రోగంబు
　　తిరుగంగఁబడెనేని త్రిప్పటగును
ఒంటితునకను శుభము, రెండింట మధ్య
మము, కనీసము మూఁట, రోగమగు నాల్గు
తునుకలౌనేనిఁ బెక్కుగాఁ దునిసి చెక్క
లడరెనేనియుఁ బ్రాణభయంబు కృష్ణ! 142

సుముహూర్తమున వడ్రంగి పరిశుద్ధుఁడై ధర్మదేవతను ప్రార్థించి దారువును తూరుపుకొసగాఁ బడవయిచి చెక్కిన నా చెక్కపాటుల ఫలములను వివరింతును. చెక్కినచెక్క ఆపాటు ననే పడినయెడల శుభము; ఎగసిపడినఁ గీడు; వెలకిలఁబడిన రోగము; తిరుగఁబడిన త్రిప్పటలు; ఒకతునుక యయ్యేనేని శుభము; రెండుతునుక లయ్యేనేని మధ్యమము; మూఁడుతునుక లయ్యేనేని నధమము, నాలుగుతునుక లయినచో రోగము, పెక్కుతునుకలైన ప్రాణభయము. 143

వ. మఱియును.

తే. హరిదిశాదిగ దశదిశలందుఁ బడిన
　　చెక్కపాటుకు ఫలము లక్ష్మీప్రదంబు
　　భయము సుతహాని నష్టము వ్యయము పోరు
　　లాభము శుభంబు మృతినిశ్చలంబు కృష్ణ! 144

చెక్కినచెక్క తూర్పుదిక్కునఁ బడెనేని శుభమును, ఆగ్నేయమున భయమును, దక్షిణమునఁ బుత్రహానియు, నిరృతి యందు నష్టమును, పడమటిదిక్కున వ్యయమును, వాయవ్య మునఁ గలహమును, ఉత్తరమున లాభమును, ఈశాన్యమున

శుభమును గలుగును. మీఁది కెగసి యున్నతస్థలమునఁ బడెనేని మృత్యువు ప్రాప్తించును. భూమియందు నాటుకొనెనేని స్థైర్యము కలుగును.

## శంకుస్థాపనవిధి

తే. కర్త సుస్నాతుఁడై ధౌతకలితవస్త్ర
ధారుఁడై భూషణాద్యలంకారుఁ డగుచు
శంకుహారిద్రమిళితగంధాంకితంబుఁ
జేసి ధాన్యముపైనుంచి చిత్తశుద్ధి. 145

యజమానుఁడు స్నానముఁజేసి వస్త్రాభరణాదుల ధరించి శంకునకుఁ బసుపుఁ బూసి గంధపుష్పాక్షతాదుల నలంకరించి దానిని ధాన్యపురాశిపై నుంచవలయును.

తే. స్వస్తిపుణ్యాహవచనప్రశస్తముగను
సరవి మంగళతూర్యము ల్మ్రోయ షోడ
శోపచారక్రియాపూజనోచితముగ
వాస్తుపురుషునిఁ బూజింపవలయుఁ గృష్ణ! 146

పుణ్యాహవాచనమును జేసి, మంగళవాద్యములు మ్రోయఁగా షోడశోపచారముల వాస్తుపురుషుని బూజింపవలయును.

## వాస్తుపురుషధ్యానము

ధ్యానశ్లోకము:—

వాస్తుదేవ నమస్తేఽస్తు భూశయ్యానిరత ప్రభో
మద్గృహాన్ ధనధాన్యాదీన్ సమృద్ధిం కురు సంపదామ్,

మహామేరుగిరి సర్వదేవనామాలయో యథా
తద్వద్బ్రహ్మాదిదేవానాం మమ గేహే స్థిరో భవ. 147

తే. పేర్మితో వాస్తుపురుషునాభిస్థలమున
హస్తమాత్ర ప్రమాణగర్తాంతరమున
శంకుసంస్థాపనముసేయ సఫల మభవ
రత్న ధాన్యంబు లుంచి ప్రయత్నముగను. 148

ఆరీతిగఁ బూజసల్పి వాస్తుపురుషుని నాభిస్థలమున హస్త ప్రమాణమగు గుంటను త్రవ్వి అందు రత్న ధాన్యములనుంచి శంకువు నుంచవలయును.

## దిగ్రాశి నిర్ణయము

మ. సౌరిదిం దూర్పున మేషసింహధనువు ల్పొంపొందు యా
మ్యంబునం, దరయంగా వృషకన్యకామకరముల్ హర్షించు
నవార్వరుణిక్, మెఱయుఁ యుగ్మతులాఘటంబులు విజృం
భించుఁ ధనేశస్థలిక్, దిరమై కర్కటఝషాళిరాసులు మహా
దేవాదిదేవస్తుతా! 149

తూర్పున మేషసింహధనుస్సులును, దక్షిణమున వృషభ కన్యామకరములును, పశ్చిమమున మిథున తులాకుంభములును ఉత్తరమున కర్కట మీన వృశ్చికరాసులును నుండును.

## వాస్తుపురుషదృష్టి ద్వారనిర్ణయము

తే. తెలియఁగా వాస్తుపురుషుఁ డేదిక్కుఁ జూచు
నచట ద్వారము లుంచ నర్థాప్తి సుఖము
నితర మగుచోట్ల నుంచిన ధృతి దొలంగి
రోగశోకంబు లగును సరోజనాభ! 150

వాస్తుపురుషుఁ డేదిక్కునుజూచుచుండునో యాదిక్కున

దలవాకిలిని బెట్టిన ధనప్రాప్తియు సుఖమును గలుగును. తక్కిన చోట్లఁ దలవాకిలిని బెట్టిన రోగమును, శోకమును గలుగును.

## మాసద్వార నిర్ణయము

మ. మును దాశ్రావణికంబునందు సదనంబు ల్గట్టినం దూర్పుది
క్కునయుక్ వాఁకిలినిల్పఁ గార్తికమునం దింపొందనద్దక్షిణం
బున నమ్మాఘమునందుఁ బశ్చిమదిశక్ బొందింప యుక్తం
బగుక్, జనువైశాఖమునందు నుత్తరదిశ న్యాస్త్రోక్తి సర్వే
శ్వరా ! 151

శ్రావణమాసమునఁ గట్టెడుగృహములకుఁ దూర్పుదిక్కునఁ దలవాకిలి నుంచవలయును. కార్తికమునఁ గట్టువానికి వాకిలి దక్షిణమున నిడవలయును. మాఘమునఁ గట్టువానికిఁ బశ్చిమమునను, వైశాఖమునఁ గట్టువానికి నుత్తరమునను ద్వారముల నుంచవలయును.

## సౌరమాన మాసనిర్ణయము

సీ. కర్కిసింహంబుల నర్కుఁ డుండినఁ దూర్పు
దిక్కువాకిళ్లు వర్తింప వచ్చుఁ
దులవృశ్చికంబుల నెలమి భానుం డుండ
శమనదిఙ్ముఖము ద్వారంబు దనరు
మకరకుంభంబుల మార్తాండుఁ డుండినఁ
బడమటి వాకిండ్లు పరగు నెపుడు
మేషవృషంబుల మిహిరుఁ డుండిన నుత్త
రపుదిశ ద్వారముల్ రహివహించు

మెరసి కన్యఁ జాప మీన యుగ్మంబులఁ
గట్టరాదు గృహముఁ గట్టిరేని
వ్యాధి హాని గండబాధలు సిద్ధించు
ననుచు వాస్తుకర్త లనిరి కృష్ణ! 152

కర్కాటక సింహమాసములయందు సూర్యుఁడుండ గృహములుగట్టిరేని తూర్పుభాగమున ద్వారమును బెట్టవలయును. తులా వృశ్చికమాసములయందు దక్షిణద్వారమును, మకర కుంభ మాసములయందుఁ బశ్చిమటిద్వారమును, మేషవృషభమాసములయం దుత్తరద్వారమును బెట్టవలెను. కన్యామిథునధనుర్మీన మాసములయందు గృహములను గట్టరాదు. కట్టిరేని రోగము, హాని, గండము, బాధ కలుగును.

## కర్తృరాశ్యనుకూలద్వారనిర్ణయము

చ. వలసగుఁ దూర్పుదిక్కు తలవాఁకిలి వృశ్చికమీనకర్కిరా
సులఁ దగువారికిన్ శమనుచోటను యుగ్మమృగాంగనాదిరా
సులఁ దగువారికిన్ వరుణుచోటఁ దులావృషకుంభరాశివా
రలకును కార్ముకాజహరిరాసులవారికి నుత్తరంబజా! 153

వృశ్చికమీన కర్కాటకరాసులవారియిండ్లకుఁ దూర్పు ద్వారంబును మిథునమకరకన్యారాసులవారికి దక్షిణద్వారమును, తులావృషభకుంభరాసులవారికిఁ బశ్చిమద్వారమును, మేషసింహ ధనూరాసులవారికి ఉత్తరద్వారమును మంచివి.

## అష్టభాగద్వారఫలనిర్ణయము

సీ. ప్రాగాదిదిశలకు భాగఫలద్వార
నిర్ణయం బొనరింతు నేర్పుమీఱ

నొక్కొక్కదిశకు పాళ్లొనర నెన్మిదిజేయ
నీశాన్య మాద్యమై యింద్రుదిశకు
హానిశోకము నర్థ మధిపుసన్మానంబు
ధనము శౌర్యము క్రోధమును భయంబు
ఫలములై తగుబహిర్ద్వారదేశములకు
నాగ్నేయ మాద్యమై యమునిదిశకు
ప్రాణభయంబును బంధనంబును భీతి
యర్థ సంప్రాప్తి ధాన్యాభివృద్ధి
సుఖదుఃఖరోగముల్ సొరిది ఫలంబులు
పలలాశి దిశ మొదల్ వరుణదిశకు
సుతహాని రిపువృద్ధి సుఖము ధనప్రాప్తి
కలిమి శోకంబు రోగమును భయము
ఫలములు వరుసతోఁ బవమానుఁ డాదిగా
నుత్తరమునను బెంపొందు నెపుడు
సరవితో భార్య నిందయు సత్వనష్టి
హానిధాన్యాభివృద్ధి ధనాగమంబు
పరమసౌఖ్యము దుఃఖము బాధ లనెడి
ఫలము లెఱుఁగక ద్వారముల్ నిలుపఁదగదు. 154

ప్రాగాదిచతుర్దిశలలో నేదిక్కున ద్వారముఁ బెట్టినను ప్రతిదిక్కును ఎనిమిది భాగములుగాఁ జేయవలయును. అట్టి యెనిమిదిభాగములకును క్రమముగ ఫలములు—తూర్పు దిక్కున ద్వారము బెట్టుటకు నిర్ణయించినయెడల నీశాన్యము మొదలుకొని యాగ్నేయము వఱకును కొలిచి యెనిమిది భాగములు జేయవలయును. అట్టి యెనిమిదిభాగములకు క్రమముగా

హాని, శోకము, అర్థప్రాప్తి, రాజసమ్మానము, ధనప్రాప్తి, శౌర్యము, క్రోధము, భయము, ఫలములు. దక్షిణద్వారమునకు నాగ్నేయము మొదలు నిరృతివఱకు నెనిమిదిభాగములు సేయ వానిలో నొక్కొకదానికిఁ గ్రమముగా-ప్రాణభయము, ధనము, భయము, అర్థప్రాప్తి, ధాన్యము, సుఖము, దుఃఖము, రోగము ఫలములు. పశ్చిమద్వారమునకు నిరృతిదిశ మొదలుకొని వాయవ్యమువఱకు నెనిమిది భాగములుసేయ వానిలో నొక్కొకదానికి వరుసగా సుతహాని, శత్రువృద్ధి, సుఖము, ధనప్రాప్తి, కలిమి, శోకము, రోగము, భయము, ఫలము. ఉత్తర ద్వారమునకు వాయవ్యము మొదలుకొని యీశాన్యము వఱకును నెనిమిదిభాగములుసేయ నొక్కొకదానికి భార్యకు నింద, బలహీనత, హాని, ధాన్యాభివృద్ధి, ధనాగమము, సౌఖ్యము, దుఃఖము, పీడ ఫలములు.

### గ్రహభాగఫల ద్వారనిర్ణయము

సీ. శివశిఖిదైత్యవాయువు లాదిగాఁగఁ బ్రా
 గ్దక్షిణపశ్చిమోత్తరములందు
నవభాగములుసేయ రవిశశికుజబుధే
 జ్యకవిసూర్యాత్మజసైంహికేయ
కేతుస్థలములౌను గీష్పతిపై దేవ
 తలకు శుక్రునిమీఁద నిలుచు నరుల
యిండ్లకుఁ బశువుల కెలమి సౌమ్యునిమీఁద
 సర్వత్ర కవిగురు సౌమ్యులందు
నిల్లువెడఁగ దాఁపల నించు కధిక
మునిచి యచటఁ గవాటంబు లుంచవలయు

మఱియుఁ బాపగ్రహస్థానమధ్యమమున
నిలుపరాదు బహిర్ద్వార నియతిఁ గృష్ణ. 155

తూర్పుద్వారమును నీశాన్యము మొదలుగా నాగ్నే యమువఱకును గొలిచి తొమ్మిదిభాగములు సేయఁగా మొదటి భాగమునకు సూర్యుఁడు, రెండవభాగమునకుఁ జంద్రుఁడు, మూఁడవభాగమున కంగారకుఁడు, నాలుగవభాగమునకు బుధుఁడు, అయిదవభాగమునకు బృహస్పతి, ఆఱవభాగమునకు శుక్రుఁడు, ఏడవభాగమునకు శని, ఎనిమిదవభాగమునకు రాహువు, తొమ్మి దవభాగమునకు కేతువు నధిపతులు. వీనిలో బృహస్పతిభాగ మున దేవతాయతనములకు ద్వారములను బెట్టవలయును. శుక్రునిభాగమున మనుష్యుల యిండ్లకును, బుధుని భాగమునఁ బశువుల యిండ్లకును, ద్వారములను బెట్టవలయును. ఈభాగ. ములలో నేవనిభాగమందు ద్వారము నిలువఁబడుచున్నదో యా భాగమునం దెడమదిక్కు కొంచెము అధికముగా నుండునట్లు జేసి ద్వారమును బెట్టవలయును. ద్వారమున కెడమదిక్కునఁ దలుపుండవలయును. దక్షిణద్వారమునకు నాగ్నేయము మొదలు, పశ్చిమద్వారమునకు నిరృతి మొదలు ఉత్తరద్వారమునకు వాయ వ్యము మొదలును గొలిచి మీఁదఁ జెప్పినప్రకారము ద్వారము లను బెట్టవలయును.

## ద్వారబంధ లక్షణము

తే. సప్తతాళోన్నతంబు నెంచఁగఁ ద్రితాళ
మాయతము ద్వారబంధంబులందుఁ దగును
నిడుపు తొమ్మిదిపాళ్లను వెడలు పైదు
పాళ్లతోనైనఁ దగు ద్వారబంధ మభవ! 156

ఏడు జుత్తెళ్ల పొడవు, మూఁడు జుత్తెళ్ల వెడల్పును ద్వారబంధములకు మంచివి. మఱియు నిడుపు తొమ్మిదిపాళ్లును, వెడలుపైదుపాళ్లును గలద్వారబంధ ముత్తమము.

తే. కర్తరాశికి యుక్తంబుగాక నాయ
మున్న యాద్వారబంధము నొప్పదండ్రు
అరయ విషమాయములు రాశి కనుగుణంబు
లయినద్వారబంధ మర్థాప్తి కృష్ణ! 157

కర్త్రురాశికి విరుద్ధమగునాయముగల ద్వారబంధము యుక్తముగాదు. ధ్వజసింహవృషభగజములను నాలుగువిధము లయిన యాయములలో కర్తరాశి కనుకూల మగు నాయము గల ద్వారబంధము యజమాని ధనమును గూర్చును.

చోరగండికి

ఆ. వైరి చోరరాజ వహ్నిభయంబుల
వలన బయలు దెలుపవలయు గండి
కెలమిలక్షణంబు వలదు గూఢంబుగా
నిలుపవలయుఁ దనకు వలయునెడల. 158

శత్రువులవలనను, దొంగలవలనను, రాజులవలనను, అగ్నివలనను భయములు సంభవించినపుడు ఇంటివారు తప్పించుకొనుటకు వలయుద్వారము నొకదాని నేర్పరచవలయును. అందులకు లక్షణముతోఁ బనిలేదు. ఎవ్వరు నెఱుఁగకుండునట్టుఁ దనకుఁ గావలసినచోట నాద్వారమును పెట్టవచ్చును.

ద్వారబంధఖట్వా కవాటదారు నిర్ణయము

తే. దారువులు రెంట ద్వారబంధంబు తగదు
మంచమున మూఁడుజాతు లమర్పరాదు

తలుపు సరిపల్క లైయున్నఁ దగదటంద్రు
సోదరి దూలము నడుముగా నడువరాదు. 159

రెండుజాతుల దారువుతో మంచమును జేయరాదు. మూఁడుజాతులుగల దారువుతో మంచమును జేయరాదు. తలుపులకుఁ బేసిగాఁ బలకలు పెట్టవలయును; సరిపలకలను బెట్టరాదు. ఇల్లు చొచ్చునపుడు దూలముల కడ్డముగా నడువ రాదు.

తే. బైటివాకిలి కెదురుగాఁ బరునియింటి
వాకిలియు గోడమూలయు వైర మొదవు
ఇంటిలోనైన వాకిలి కెదురుగాను
గోడమూలయుఁ గంభము లుఁడరాదు. 160

తనయింటి తలవాకిలికి పరునియింటి తలవాకిలియు, గోడమూలయు నెదురుగా నుండిన వైరము సంభవించును. తన యింటిలోను వాకిండ్ల కెదురుగాను, గోడమూలలను, గంబము లుండరాదు.

క. మిట్టతలఁ ద్వారంబును
నెట్టవ దగ్గయినచోట నిలయంబు వెసన్
గట్టిన మేలు తొలంగును
కొట్టము వెనుగాడినిడివి గూడదు నడవన్. 161

మిట్టను ద్వారమునుబెట్టి తగ్గయినచోట నిల్లుగట్టినఁ గీడు జేకూరును. కొట్టము వెన్నుగాడి నిడివి నడువరాదు.

తే. మూల తలవాకిలై యున్న మేలు దొలఁగుఁ
గొంచెమైయున్నఁ బోడవైనఁ గూడదందు

రెదురుగా వాకిటను బరునింటిదీప
కాంతి లోగిట వెలుఁగ రోగప్రదంబు. 162

తలవాకిలిని మూఁటఁబెట్టిన మేలు దొలఁగును. వాకిలి పొట్టిగాఁగాని, పొడవుగాఁగాని యుండరాదు. పరునియింటి దీపకాంతి తనలోపలఁ జొచ్చెనేని రోగము ప్రాప్తించును.

—ద్వారబంధకవాటములకు లగ్ననిర్ణయము—

క. స్థిరరాసు లుత్తమంబులు
గరిమన్ ద్వారములు నిలుపగాఁ జరమైనన్
బరగుఁ దుల ద్విస్వభావము
లరుదుగఁ దలుపులు ఘటింప ననువగుఁ గృష్ణా! 163

ద్వారబంధములు నిలుప స్థిరరాసులు—వృషభ సింహ వృశ్చిక కుంభములు—ఉత్తమములు. చరరాసులలోఁ దుల మంచిది. ద్విస్వభావములు—మిథునకన్యాధనుర్మీనములు—తలుపులు బెట్టుట కనువైనవి.

—క్షేత్రభాగ గృహనిర్మాణ లక్షణము—

సీ. భవనమానంబు షడ్భాగంబు లొనరించి
యందులోపల నిలయంబు వెనుక
కడను పిశాచభాగము నొక్కపాలు పో
విడిచి రెండవపాలు విదితమైన
మనుజభాగంబున మఱి గృహం బొనరించి
యవల మూఁడవపాలి దైనదేవ
భాగంబులోపలఁ బందిళ్లు సమకొల్పి
కడమయౌ మూఁడుభాగములు వేడ్క

నింటిముందఱ ముంగిలి కెనయఁ జేసి
బావియును దోఁట నిర్మింప బాగుమీఱు
నాయనిర్మాణముల నిశ్చయంబుఁ దెలిసి
యిండ్లుగట్టిన శుభములు నెసఁగుఁ గృష్ణ. 164

ఇంటి నిడివిని ఆఱుభాగములు నేసి యందొకభాగమును ఇంటికి వెనుక పిశాచభాగమును విడిచిపెట్టి రెండవభాగమగు మనుష్యభాగమున నిండ్లు గట్టవలయును. మూఁడవదియగు దేవ భాగమున పందిళ్లు నెలకొల్పవలయును. తక్కిన మూఁడుభాగ ములలో నింటి ముంగిలికిఁ దగినచోటును వదలి తక్కిన ప్రదేశ మందు బావియును, తోఁటయును నిర్మింపవలయును.

## భిత్తిప్రమాణము

మ. పదిజేన ల్పొడవైనగోడ ద్విజభూపాలప్రశస్తంబు తో
మ్మిదిజేన ల్డగు వైశ్యశూద్రులకు నెమ్మిన్సంకరశ్రేణి కె
న్మిదిజేన ల్మఱి వీటి కెక్కువయిన న్మేలొందు లోపంబు చె
ల్లదుమందంబిడమూరెఁడాది తగునీహస్తాంతపర్యంతమున్.

పదిజేనలపొడవుగలగోడలు బ్రాహ్మణక్షత్రియుల కుత్తమ ములు. తొమ్మిదిజేనలవి వైశ్యశూద్రులకును, ఎనిమిదిజేనలవి సంకరజాతివారికిని మంచివి. ఈ ప్రమాణముకంటె నధికము గాను నుండవచ్చును. తక్కువగామాత్ర ముండరాదు. ఆగోడలు మూరెడు మొదలు రెండుమూరల వఱకును మందము గలిగి యుండవచ్చును.

## గోడలు విరిగినందుకు ఫలము

క. మేలిమిగ గోడఁ బెట్టఁగ
ప్రీలినఁ దస్కరభయంబు వెలిప్రీలినచో

నాలము లోపీగిన ని
ల్లాలికి భయమౌ నటందు రార్యులు కృష్ణా. 166

గోడను బెట్టునపు డది ప్రీలినఁ దస్కరభయము గలుగును. వెలిగా ప్రీలినయెడలఁ గలహము, లోఁగా ప్రీలిన నిల్లాలికి భయమును గలుఁగును.

## జాలకములు

క. నానావిధహర్మ్యములకుఁ
బూనఁగఁవగఁ జిత్రకములు మొగి నలుదెసలన్
మానుగ గృహస్థులిండ్లకు
భానుజదిశఁ బశ్చిమమునఁ బరగు గవాక్షుల్. 167

నానారూపములు గలమేడలకు నాల్గుదిక్కులను గవాక్షము లుంచవలయును. గృహస్థుల యిండ్లకు దక్షిణ పశ్చిమములయందు గవాక్షము లిడవలయును.

## భిత్తినిర్మాణ లక్షణము

క. దినదినము గోడఁబెట్టఁగ
నెనయఁగ మృత్తిక గ్రహింప నీశాన్యమునన్
దనరును మూరెఁడుకిటుగ
నొనరించి మఱి గోడఁబెట్ట నుచితము కృష్ణా! 168

గోడను బెట్టుటకు ఈశాన్యభాగమున మంటిని ద్రవ్వవలయును. మఱియును మూరమూరకును గోడనుబెట్టుచు రావలయును.

## స్తంభప్రతిష్ఠకు తిథిశుద్ధి

క. నందలు రిక్తలు భద్రలు
బొందవు దర్శంబును బర్వములు వర్జితముల్

ముందఱ నిలిచినదినములఁ
జెందును కంబములు నిల్ప సిరులు మురారీ. 169

నందతిథులయందును, భద్రతిథులయందును, ఆమావాస్య యందును, పర్వములయందును స్తంభప్రతిష్ఠను జేయరాదు. తక్కిన దినములందుఁ జేసినయెడల మేలు కలుగును.

## వారశుద్ధి

మ. ఇనవారంబున వహ్నిబాధ కలహం బిష్టార్థనాశంబు చం
ద్రునివారంబున భౌమవారమున మృత్యుప్రాప్తి సంధించు సౌ
మ్యునివారంబు సురేజ్యశుక్రులదినంబుల్ సౌఖ్యబోధార్థ
ముల్, శనివారంబు తనూజహాని సదన స్తంభప్రతిష్ఠకు హరీ!

ఆదివార మగ్నిభయమును గలుగఁజేయును. సోమవార మునఁ గలహము ప్రాప్తించును. మంగళవారమున మృత్యుప్రాప్తి. బుధ బృహస్పతి శుక్రవారములు శుభప్రదములు. శని వారమునఁ బుత్త్రహానిఁ గలుగును.

## నక్షత్రశుద్ధి

తే. హస్తరేవతి శశితారకాశ్వినులును
శతభిషధనిష్ఠపుష్యముల్ శ్రవణమదితి
చిత్తరోహిణి మిత్రోత్తరాత్రయముల
స్తంభములు నిల్ప ధనసుతసౌఖ్య మభవ! 171

హస్త, రేవతి, మృగశీర్ష, అశ్విని, శతభిషము, ధనిష్ఠ, పుష్యమి, శ్రవణము, పునర్వసు, చిత్త, రోహిణి, అనూరాధ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర ఈ పదునైదు నక్షత్ర

ములయందును స్తంభప్రతిష్ఠను జేసినయెడల ధనపుత్రలాభములు గలుగును.

### స్తంభప్రతిష్ఠకు గ్రహశుద్ధి - లగ్నశుద్ధి

తే. లగ్న కేంద్ర త్రికోణములందు నుచ్చ
లందు శుభు లున్నఁ జూచిన లగ్నమలరు
పాపు లాఱింట మూఁటను బదునొకంట
నుండిరేనియుఁ గంబము లుంచ శుభము. 172

లగ్నమునందును, లగ్నమునకు ౪, ౭, ౧౦, ౫, ౯. స్థానములందు శుభగ్రహము లుండినను జూచినను, ఈ రాసులందు శుభగ్రహము లుచ్చముల నుండినను, పాపగ్రహములు ౬, ౩, ౧౧ స్థానముల నుండినను స్తంభప్రతిష్ఠను జేయుట తగును.

### స్తంభఘాతమునకుఁ గాలసర్పగతి

సీ. కాలసర్పము వెన్కగా సంచరించుచు
రహివృషభాదిత్రి రాసులందు
హరుదిశ శీర్షంబు ననిలదిఙ్మధ్యంబు
నసురదిక్పుచ్ఛమై యలరియుండు
సింహత్రయంబున శిరము వాయువునందు
నసురదిఙ్మధ్యమై యగ్నిఁ బుచ్ఛ
మగు నళిత్రయమున నసురదిక్శిరముగ
నగ్ని దిఙ్మధ్యంబు హరునిదిశను
బుచ్ఛమౌఁ గలశత్రయమునను వహ్ని
మూలఁ దలయుండు మధ్యంబు ఫాలనయను
దెసను బుచ్ఛంబు వాయువుదిశఁ జెలంగు
నిట్టిగతులందు గ్రాహ్యంబు లెఱుఁగవలయు. 173

వృషభ మిథున కర్కాటమాసములయందుఁ గాలసర్పము నకు నీశాన్యమున శిరస్సును, వాయవ్యమున నడుమును, నిర్బుతి యందుఁ దోఁకయు నుండును. సింహకన్యాతులామాసముల యందు వాయవ్యమునందు శిరమును, నిర్బుతియందు నడుమును, ఆగ్నేయమునఁ దోఁకయును నుండును. వృశ్చికధనుర్మకరమాస ములయందు నిర్బుతియందు శిరమును, ఆగ్నేయమున నడుమును, ఈశాన్యమునఁ దోఁకయు నుండును. కుంభమీనమేషమాసముల యందు ఆగ్నేయమునఁ దలయును, ఈశాన్యమున నడుమును, వాయవ్యమునఁ దోకయు నుండును. కాఁబట్టి యిట్టి గతులందు యుక్తాయుక్తస్థానములను దెలిసి స్తంభఘాతము సేయవలయును.

క. తలమీఁదఁ ద్రవ్వమృత్యువు
వలనొప్పఁగ వీఁపునందు వచ్చును బీడల్
చలనంబు తోఁకమీఁదను
చెలువుగ నిడుపైన దిశను సిరులు ముకుందా! 174

కాలసర్పముయొక్క శిరమునఁ ద్రవ్వినయెడల మృత్యు భయము గలుగును. వీఁపునఁ ద్రవ్వినఁ బీడలు సంభవించును. తోఁకమీఁదఁ ద్రవ్వినయెడల జలనము గలుగును. ఈమూఁడు చోట్లనుగాక నిడుపగుచోటఁ ద్రవ్విన సిరి గలుగును.

## సూర్యచంద్రగతులు

సీ. కర మొప్ప వృషయుగ్మ కర్కాటకంబుల
సూర్యుఁడు చరియింప సోముఁ డపుడు
సింహత్రయంబున స్థిరముగా నుండిన
వహ్నిదిశాదైన వచ్చు సుఖము

కంఠీరవంబునఁ గన్యను ద్రాసున
బద్మబాంధవుఁ డున్నఁ బద్మవైరి
యళికత్రయంబున నలరినసమయంబు
నీశానదిశయందు నెనయు శుభము
అళిధనుర్మృగముల నాదిత్యుఁ డుండంగఁ
గలువలచెలికాఁడు గరిమతోడఁ
గుంభత్రయంబునఁ గుదురుగానుండిన
ననిలకోణాద్రైన నలరు జయము
ఘటఝషాజములందు ఖమణి వర్తింపంగ
రిక్కలగమిరేఁడు నిక్కువముగ
వృషభత్రయంబున నొప్పుగా నుండిన
నసురకోణాద్రైన బొసఁగు జయము
ఆలయంబుల కీరీతి నలరు స్తంభ
ఘాతములు సేయ శుభములు గలుగు నన్య
మార్గములఁ జేయఁ బీడలు మాన వెపుడుఁ
దెలిసి వర్తింపవలయును దేవదేవ! 175

వృషభమిథున కర్కటమాసములయందు సూర్యుఁడుండఁగాను, సింహ కన్యాతులాసంబంధమయిన యుత్తర హస్తచిత్తల యందుఁ జంద్రుఁడుండఁగాను, ఆగ్నేయమున స్తంభఘాతము సేయవలయును. సింహకన్యాతులామాసములయందు సూర్యుఁ డుండఁగాను, వృశ్చికధనుర్మకరసంబంధములగు అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణధనిష్ఠలను నాలుగునక్షత్రములలో నెద్దాని యందైనఁ జంద్రుఁడు సంచరించుచుండఁగాను, నీశాన్యమున స్తంభఘాతము సేయవలయును. వృశ్చికధనుర్మకరమాసముల

యందు సూర్యుఁడుండఁగాను కుంభమీన మేషసంబంధములగు శతభిషోత్తరాభాద్ర రేవత్యశ్వినులను నాలుగునక్షత్రములలో నేదైనను సూర్యుఁడుండఁగాను వాయవ్యమున స్తంభప్రతిష్ఠను జేయవలయును. కుంభమీనమేష మాసములయందు సూర్యుఁడుండఁగాను, వృషభ మిథున కర్కాటసంబంధములగు రోహిణి మృగశీర్ష పునర్వసు పుష్యములను నాలుగునక్షత్రములలో నేదైనను జంద్రుఁడుండఁగాను నిర్ఋతియందు స్తంభప్రతిష్ఠను జేయవలయును. అట్లుకానిచోఁ గీడు ప్రాప్తించును.

## వివాహవేదికా స్తంభలక్షణము

సీ. మృగపతిత్రయమున మిహిరుఁడు నెలకొన్న
హరుని కోణాదిగా నెఱుఁగవలయు
వృశ్చికత్రయమున వెస సూర్యుఁడు వసింప
వాయుకోణాదిగాఁ జేయవలయు
కలశత్రయంబునఁ గమలాప్తుఁ డుండిన
దైత్యకోణాదిగాఁ దలఁపవలయు
ఉక్షత్రయంబుల నుష్ణదీధితి యున్న
జ్వలనదిశాదిగాఁ దెలుపవలయు
ధరణిఁ బరిణయవేదికా స్తంభసమితి
నిలుపుటకు వాస్తుశాస్త్రోక్తనిర్ణయంబు
గాక వేఱొక్కవిధమున ఘాతమైన
సంపదలు లేక హానియౌ దంపతులకు. 176

సింహకన్యాతులామాసములయందు సూర్యుఁడు సంచరించుచుండఁగా నీశాన్యమున స్తంభ ఘాతనును జేయవలయును. వృశ్చికమకరధనుర్మాసములయందు సూర్యుఁడుండఁగా

వాయవ్యమున స్తంభఘాతమును జేయవలయును. కుంభమీన మేషలగ్నములయందు సూర్యుఁడుండఁగా నిర్ఋతియందు స్తంభ ఘాతమును జేయవలయును. వృషభమిథునకర్కటరాసులయందు సూర్యుఁ డుండఁగా నాగ్నేయమున స్తంభఘాతమును జేయవల యును. ఇట్లు వివాహవేదికా స్తంభ ప్రతిష్ఠలను జేయవలయును. ఇట్లు చేయ రేని దంపతులకు దారిద్ర్యమును, హానియు సంభ వించును.

## లగ్నగతగ్రహఫలము

తే. పరగ లగ్నమునందు గీష్పతి వసింప
కంబములు నిల్పి బుధుఁడు లగ్నముననుండ
వెనుఁబరచి లగ్నమున శుక్రుఁ డెనసినప్పు
డింట్లు గప్పిన వహ్ని రహింపఁ డభవ! 177

బృహస్పతి నివసించియున్న లగ్నమున స్తంభ ప్రతిష్ఠను జేసి బుధుఁడు నివసించియున్న లగ్నమున వెన్నుగాడియెత్తి శుక్రుఁ డున్న లగ్నమున నింటిని గప్పినయెడల నెన్నటికిని నగ్నిభయము గలుగ నేరదు.

క. జలరాసుల శశి యుండఁగ
నల లగ్నమునందుఁ దొమ్మిదైదిటఁ జంద్రుం
డలరఁ గవివారమున గృహ
ములు గట్టిన వహ్ని బాధ నొందదు కృష్ణా! 178

జలరాసులయందుఁ జంద్రుఁడుండఁగా నైనను లగ్నము నకుఁ దొమ్మిది యైదు స్థానములయందును లగ్నమునను జంద్రుఁ

డుండఁగాను శుక్రవారమునందును గృహము గట్టినయెడల నగ్ని భయము గలుగనేరదు.

తే. చంద్రుఁడేనియుఁ గురుఁడేని సరవినుండు
రాశి శంకువు నిల్పి యారోహిణేయుఁ
డున్నరాశిని బరమెత్తి యుశనుఁ డున్న
రాశి గప్పిన యిండ్ల నిర్భయము కృష్ణ! 179

చంద్రుఁడైనను, బృహస్పతి యైనను లగ్నముననుండఁగా శంకువును ప్రతిష్ఠించి బుధుఁ డున్నలగ్నమునఁ బరమెత్తి శుక్రుఁ డున్న లగ్నమున గృహములను గట్టినయెడల భయముండ నేరదు.

## రాజయోగము

మ. గురువారాంచితకర్కటీధనుషలసత్కోదండలగ్నంబునన్
గురుశుక్రుల్వసియించువేళ గృహముల్కోర్కెల్దగన్ గట్టినన్
ధరఁ దద్గేహమునం జనించినశిశుల్ధాత్రీతలాధీశులై [న్.
వరభాగ్యోన్నతిఁ బుత్త్రపౌత్త్రమహిమన్ వర్తింతు రెల్లప్పుడు

గురువారమునాఁడు కర్కటక ధనుర్మీనలగ్నములలో దేని యందైనను బృహస్పతి శుక్రులలో నెవరైన నొకరు నివసించి యుండఁగా గృహంబు గట్టినయెడల నాగృహమునందు జనించిన వారు పుత్త్రపౌత్త్రసంపత్సమృద్ధిగలవారును, రాజ్యాధిపతులును నగుదురు.

క. ద్విశరీరంబుల స్థిరముల
వశులై శుభులున్న మేలు వారును బఱిటన్

విశదముగ నున్నఁ జూచినఁ
కుశలతఁ గంబములు నిల్పఁ గోరిక లలరున్. 181

ద్విస్వభావలగ్నములయందుగాని, స్థిరలగ్నములయందు గాని శుభులుండినను, శుభులు పదియవ యింటియం దుండినను, శుభులు లగ్నమును జూచినను స్తంభప్రతిష్ఠను జేయువానికి నానావిధములయిన యైశ్వర్యములు గలుగును.

మ. సొరిది స్త్రీనగృహంబునందుఁ గవి దా సొంపొంది నన్నాల్గిటన్
గురుఁడు న్నిల్చిన నుచ్ఛలందు గురుశుక్రు ల్పెంపుతో నుం
డినన్, గరిమ న్మందుఁడు పద్దకొంట నెలకొన్న న్వైభవ
ప్రాప్తినీ, ధరమీఁదన్ జిరకాలమున్నను గృహస్తంభంబు
లన్ నిల్పఁగన్. 182

మీనలగ్నమున శుక్రుఁడును, నాలుగింట బృహస్పతియు నుండగా, లేక వీరిరువురు నుచ్ఛస్థానములయం దుండఁగా, పదు నొకొండవయింట శనియుండగాను, గృహమునకు స్తంభ ప్రతిష్ఠను జేసినయెడల నాగృహము చిరకాలము సకలైశ్వర్యము లతోఁ దులదూగును.

మ. అమరాచార్యుఁడు రాశి నాలిటను సప్తాశ్వుండు శుక్రుండు స
ప్తమరాశిన్ దశమంబునన్ శశియు లాభస్థానమున్ సౌరి పం
చమరాశిన్ బుధుఁ డున్నవేళల గృహస్తంభప్రతిష్ఠ ల్మహో
త్తమమై యుండు ననేకవత్సరము లీధాత్రీస్థలిన్ మాధవా!

లగ్నమున బృహస్పతి యుండఁగా నతనికి నాలింట సూర్యుఁడును, ఏడిట శుక్రుఁడును, పదింటఁ జంద్రుఁడును, పదునొకంట శనియును, అయిదిట బుధుఁడును నివసించి

యుండిరేని స్తంభప్రతిష్ఠను జేయుట ఉత్తమము. మఱియు నిట్టి లగ్నమునఁ గట్టిన గృహము శాశ్వతమైన సంపదగలదై యుండును.

## ఆయుర్యోగము

మ. గురియా లగ్నమునన్ గురుండయిన శుక్రుండైన నుండంగ
మం,దరముల్ గట్టిన నూఱువత్సరము లుద్దీపించు సౌమ్యుండు
భా, సురత న్నిల్చిన నేఁబదేండ్లు మను నీక్షోణిస్థలిన్వీరు ము
వ్వురు లగ్నంబున నుండిరేని విభవంబు ల్చెందు నెల్లప్పుడున్.

లగ్నమున గురుశుక్రులలో నెవ్వరైన నొక రుండఁగఁ గట్టిన గృహము నూఱువత్సరములు సుఖస్థితిగలదై యుండును. లగ్నమున బుధుఁ డుండెనేని యేఁబదివత్సరము లుండును. గురు శుక్ర బుధులు మువ్వురు నుండిరేని విభవములు చేకూరును.

తే. రమణఁ గంబము లోగి నిల్పుసమయమునకు
గురుఁడు చంద్రుఁడు నాల్గింటఁ గుజుఁడు శనియుఁ
బదునొకంటను నిల్చిన భవనములకు
నాయు వగునంద్రు నెనుబదియబ్దములును. 185

స్తంభప్రతిష్ఠను జేయులగ్నమునకు గురుచంద్రులు నాల్గింటను, గుజశనులు పదునొకంటను నుండిరేని యాగృహ మెనుఁబది యేండ్లు సకలైశ్వర్యములు గలదైయుండును.

తే. లగ్నమున శుక్రుఁ డుండం గరంబు బుధుఁడు
పదిటఁ గేంద్రమునందుఁ గీష్పతియుఁ దరణి
పదునొకట నున్నఁ గంబముల్ పాదుకొలుపు
నిలయము శతాబ్ధములు ధాత్రి నిలుచుఁ గృష్ణ! 186

లగ్నమున శుక్రుఁడును, పదవయింట బుధుఁడును, కేంద్రమునందు గురుఁడును, పదునొకండవస్థానమున సూర్యుఁడును నున్నసమయమునఁ గట్టినగృహము నూఱుసంవత్సరములు పరమైశ్వర్యముతో నుండును.

క. కవి లగ్నమునను మూఁటను
రవి కుజుఁ డాఱిటను గురుఁడు రహి నైదింటన్
నివసించునపుడు కంబము
భువి నిల్ప శతద్వయాబ్దములు వర్ధిల్లున్. 187

లగ్నమున శుక్రుఁడును, మూఁట సూర్యుఁడును ఆఱిట నంగారకుఁడును, అయిదింట గురుఁడును నుండఁగా గట్టిన గృహము రెండునూఱులసంవత్సరములు పరమైశ్వర్యంబుతో నుండును.

## పట్టికాబంధము

సీ. తనరఁ బూర్వాదిప్రదక్షిణంబుగ దూల
ములు చౌకముగఁ గూర్పవలయు నపుడు
ఆగ్నేయమునను మూలాగ్రసంయోగంబు
మూలంబు మూలంబు మొనయు నైరృత్య
దిక్కునఁ బవమానుదిశ నగ్రమూలసం
ఘటనంబు నీశానుకడను బొల్చు
నగ్రమగ్రము వీని కభిధానములు తూర్పు
గజ మెనుబోతు భానుజునికడను
వృషము పడమట నుత్తరం బెనయు గజము
గజముపైఁ బోతు పోతుపైఁ గడఁగు వృషము

వృషభగజములపై నజం బెసఁగు వరుసఁ
దెలిసి దూలము లెత్తఁగావలయుఁ గృష్ణ! 188

దూలములను జోకముగాఁ గూర్చునపుడు తూర్పు దూలముయొక్క మొదలును దక్షిణపుదూలముయొక్క కొనయును నాగ్నేయమునఁ గూడవలయును. దక్షిణపుదూలముయొక్క మొదలును పడమటిదూలముయొక్క మొదలును నిర్‌ృతి దిక్కునఁ గూడవలయును. పడమటిదూలముయొక్క కొనయును ఉత్తరపుదూలముయొక్క మొదలును వాయవ్యమునఁ గూడవలయును. ఉత్తరపుదూలముయొక్క కొనయును తూర్పు దూలముయొక్క కొనయును ఈశాన్యమునఁ గూడవలయును. తూర్పుదూల మేనుఁగనియు, దక్షిణపుదూల మెనుబోతనియు, పడమటిదూలము వృషభమనియు, ఉత్తరపుదూలము చింబోతనియుఁ జెప్పఁబడును. కాఁబట్టి యేనుఁగుమీఁద నెనుబోతును, ఎనుబోతుమీఁద నెద్దును, ఎద్దుమీఁద నేనుఁగును, ఏనుఁగు మీఁద చింబోతును బెట్టవలయును.

## దారుసంధిని లక్షణము

ఉ. మూలము శక్తిరూపము సమున్నతి నగ్రము శంభురూపమా
మూలము నగ్రముల్ గదియ మోదకరంబగు నగ్రమగ్రముల్
మేలు దొలంగఁజేయు గృహమేధికి మూలము మూలముల్
శిఖి, జ్వాలల నేర్చు దారువులసంధి యెఱుంగక యిండ్లు
గట్టినన్. 189

దూలముయొక్క మొదలు శక్తిస్వరూపము; కొన శంభుస్వరూపము. కాఁబట్టి మొదలు చివరలు రెండును జేర్చిన యెడల శుభము గలుగును. కొనయు కొనయుఁ గూర్చిన

యెడలఁ గీడు గలుగును. మొదలును మొదలును జేర్చినయెడల నగ్నిభయము కలుగును. కావున దారుసంధుల నెఱిఁగి గృహము లను గట్టుట తగును.

క. ప్రాగుత్తరాగ్రములుగా
బాగుగ గృహదారుసమితి బరపిన శుభమౌ
రోగము దక్షిణపశ్చిమ
భాగాగ్రములైనఁ జెందుఁ బతికి మురారీ! 190

ఇండ్లకు దారువు తూర్పు ఉత్తరము కొనలుగా నుంచుట శుభప్రదము; దక్షిణము పడమరదిక్కుల కొనలుంచినయెడల గృహయజమానునకు రోగము ప్రాప్తించును.

తే. కంబములు లేక నిలయంబు గట్టరాదు
కంబములు చాలుదప్పిన కంబసూడు
జేసిదంతెలు దూలముల్ బెరయు సరులు
పొరుగుకొట్టము వెనుపోటు పొసఁగ దభవ. 191

కంబములు లేక ఇండ్లను గట్టరాదు. కంబములు చాలు దప్పిన కంబసూడు గనుక కీడుగలుగును. దంతెలు జేసిగా నుండ వలయును. దూలములు సరిగా నుండవలయును. పొరుగువారి కొట్టము వెన్నుపోటి యుండరాదు.

## గృహౌన్నతసూత్రము

తే. దూలములకును భూమికి నూలువట్టి
యెన్ని యంగుళ లగునవి యెనిమిదింట
పాలుగొన శేష మాయముల్ పరగ నందు
జేసుల శుభంబు సరులందు బెరయుఁ గీడు. 192

దూలములకును భూమికిని సూత్రమును బట్టి కొలువఁగా వచ్చు నంగుళముల నెనిమిదింట భాగించఁగా ౧ మిగిలిన ధ్వజాయము, ౨ మిగిలిన ధూమాయము, ౩ మిగిలిన సింహాయము, ౪ మిగిలిన శునకాయము, ౫ మిగిలిన వృషభాయము, ౬ మిగిలిన ఖరాయము, ౭ మిగిలిన గజాయము, ౮ మిగిలినఁ గాకాయము. ఈయెనిమిది విధముల యాయములలో ధూమశ్వానఖరకాకాయములను వర్జింపవలయును. ధ్వజసింహావృషభగజాయములలోఁ గర్త కనుకూలమగు నాయము నుంచవలయును.

తే. తల్లిదండ్రియు నన్నలు దక్షిణమునఁ
బశ్చిమంబున నుండిన భద్రమగును
ఉత్తరము దూర్పు లోగిలి నొత్తమేలు
దక్షిణంబును బడమరఁ దగదు జరుప. 183

తల్లిదండ్రులయొక్కయు అన్నలయొక్కయు గృహములు దక్షిణపువైపుననైనను పడమరవైపుననైనను ఉండవలయును. వీరికి దిగువను పిన్నలయిండ్లుండవలయును. లోగిలి ఉత్తరము వైపునకును తూర్పువైపునకును జరుగవచ్చును. దక్షిణమునకును బడమరవైపునకును జరుగకూడదు.

### ఏకశాల లక్షణఫలము

సీ. నలుదిశల వాకిళ్లుగల యేకశాలకు
విశ్వతోముఖ మనుపేరు వెలయు
ప్రాగ్ద్వార హీనమై పరఁగు వ్యాఘ్రపదాఖ్యఁ
బశుమృగతస్కరబాధ లొదవు

ఇల దక్షిణద్వారహీనమై గృహశేఖ
రాఖ్యాక మఖిలభాగ్య ప్రదంబు
రమణఁ బ్రత్యగ్ద్వారరహితమై శ్రీనిల
యాఖ్యంబు పుత్రపౌత్రాభివృద్ధి
ఉత్తరద్వారరహితమై యున్న శాల
సూరకపదాఖ్య రాజభయాకరంబు
అపవరాంచితకోణమధ్యమున నిడియె
పుండరీకాఖ్యఁ దగి శుభంబులు నొసంగు. 194

నాలుగు దిక్కులను వాకిళ్లుగలగృహమునకు విశ్వతోముఖ మనిపేరు. తూర్పున ద్వారము లేక తక్కినదిక్కులందు ద్వారములుగల గృహమునకు వ్యాఘ్రిపద మని పేరు. దానికి ఫలము పశుమృగతస్కరబాధలు. దక్షిణమున ద్వారములేక తక్కినదిక్కుల ద్వారములుగల గృహము గృహశేఖర మనఁ బడును. అది భాగ్యముల నిచ్చును. పడమటిదిక్కున ద్వారము లేక తక్కినదిక్కుల ద్వారములుగల గృహమునకు శ్రీనిలయ మనిపేరు. అది పుత్రపౌత్రాభివృద్ధిఁ గలుగఁజేయును. ఉత్తరమున ద్వారము లేక తక్కినదిక్కుల ద్వారములుగల గృహమునకు సూకరపద మనిపేరు. అది రాజభయము గలుగఁజేయును. విశ్వతోముఖమే గూడలులేక వెలితిగా కోణమధ్యమున గట్టిన పుండరీక మగును. అది శుభప్రదము.

## ద్విశాలలక్షణము—ఫలము

సీ. యామ్యపశ్చిమముల సలరు ద్విశాలాఖ్య
కమలాకరము లక్ష్మిఁ గలుగఁ జేయు
బశ్చిమోత్తరములఁ బరఁగు ద్విశాలకు
శ్వానపదాఖ్య తస్కరభయంబు

ఉత్తరప్రాగ్ద్వాశాలో ష్ట్ర దంష్ట్రాహ్వయం
బయి చోరభయము నార్తియును జేయుఁ
బూర్వదక్షిణములఁ బొసఁగు ద్విశాలాఖ్య
భుజగదంష్ట్రము విషంబులభయంబు
కావున ద్విశాలలక్షణక్రమము ఫలము
లరసి గృహముల నిర్మింప నధిపునకును
మొనసి తత్తత్ఫలంబుల నెసయఁజేయు
వాస్తుసిద్ధాంతమత మిది వనజనాభ! 195

దక్షిణపుపారువను, పడమటిపారువను గట్టిన ద్విశాల కమలాకరమని చెప్పఁబడును. అది లక్ష్మీప్రదము. పడమటిపారువను ఉత్తరపుపారువను గట్టిన ద్విశాల శ్వానపదమని యెన్నఁబడును. అది చోరభయమును గలుగఁజేయును. ఉత్తరపుపారువను, తూర్పు పారువనుగట్టిన ద్విశాలకు ష్ట్రదంష్ట్రమని పేరు. అది యార్తిని గలిగించును. తూర్పుపారువను దక్షిణపుపారువను గట్టిన ద్విశాల భుజగదంష్ట్ర మనిపించుకొనును. అందువలన విషభయంబు గలుగును. కాబట్టి ద్విశాలలక్షణముల దెలిసి గృహములను గట్టవలయును.

## త్రిశాలలక్షణము—ఫలము

సీ. సరవిఁ బూర్వముఖత్రిశాలాఖ్య హారిపదం
బిష్టకామార్థంబు లిచ్చు నెపుడు
జగతి యామ్యముఖత్రిశాలో ష్ట్రదంష్ట్రాఖ్య
కము శత్రుభీతి వేగమె యొనర్చు
వరుణాదిఙ్ముఖముగాఁ బరగు త్రిశాల క్షు
ద్వాభిధానము బహుహానిఁ జేయు

నలరు నుదఙ్ముఖం బైన త్రిశాల జ
  యంతినాఁ బుత్రపౌత్రాభివృద్ధి
శమనదిఙ్ముఖహీనమై రమణ నితర
దిశల మూఁటను ద్వారముల్ విశదముగను
నమరిన త్రిశాల కల్యాణమనఁగఁ జెల్లు
నఖిలసంపత్ప్రదాయకం బగును గృష్ణ! 196

దక్షిణము, పడమర, ఉత్తరము ఈమూఁడు దిక్కులను గట్టి తూర్పున వాకిలిఁ బెట్టినయెడల హారిపద మనిపించుకొనును అందున నిష్టకామ్యార్థము లొనఁగూడును. పశ్చిమము, ఉత్తరము, తూర్పు ఈమూఁడు దిక్కులను గృహములను గట్టి దక్షిణమున వాకిలిఁ బెట్టిన సుష్ట్రదంష్ట్ర మగును. అది శత్రుభయము జేకూర్చును. ఉత్తరము, తూర్పు, దక్షిణము ఈమూఁడు దిక్కుల యందును గృహములుగట్టి పడమట వాకిలిఁ బెట్టిన నది క్షయ మనువేరఁ బరగును. అది హానిదము. తూర్పు, దక్షిణము, పడమర వీటియందు గృహములుగట్టి యుత్తరమున వాకిలిఁ బెట్టిన జయంతి యగును. అది పుత్రపౌత్రాభివృద్ధిఁ గూర్చును. దక్షిణమున ద్వారములేక తక్కిన మూఁటియందును ద్వారము లుండినఁ గల్యాణ మనఁబరగును. అది సంపదల నిచ్చును.

## చతుశ్శాలలక్షణము—ఫలము

సీ. దిశలు నాల్గిటియందుఁ విశదంబుగాఁ గట్టు
  సదనంబు ధరఁ జతుశ్శాల యయ్యె
అది సర్వతోభద్ర మది చతుర్భద్రక
  మనుసమాహ్వయముల నలరు నెపుడు

స్వస్తికాహ్వాయము ప్రాగ్ద్వారసంయుత మైనఁ
బశుకరితురగసంపత్కరంబు
దక్షిణద్వార మై తగ వర్ధమానాహ్వ
యము వస్తువర్ధమానమగుఁ జెలఁగు
భూమిఁ దనరు సంధ్యావర్తనామమునను
బశ్చిమముఖంబు రత్నసంపద లొసంగు
తనరు *రుచకాఖ్య ముత్తరద్వార మైన
నన్నపానాదిభోగభాగ్యంబు లొసఁగు. 197

నాలుగు దిక్కులను గట్టిన గృహము చతుశ్శాలయనియు, సర్వతోభద్ర మనియుఁ, జతుర్భద్రకమనియుఁ జెప్పఁబడును. అట్టి చతుశ్శాలకుఁ దూర్పున ద్వారమును బెట్టిన నది స్వస్తిక మనఁబడును. దానియందు పశువులు, ఏనుఁగులు, గుఱ్ఱములు మిగుల నభివృద్ధిని జెందును. దక్షిణమున ద్వారముగల గృహమునకు వర్ధమాన మనిపేరు. అందు ధనము శాశ్వతముగ నిలిచి యుండును. పశ్చిమ ద్వారముగల చతుశ్శాల సంధ్యావర్త మనుపేరఁ బరగును. దీనియందును ధనము శాశ్వతముగ నిలిచి యుండును. ఉత్తర ద్వారముగల చతుశ్శాల చక్ర మనఁబడును. దీనియందు సకల విధములగు భోగభాగ్యము లుండును. చతుశ్శాలకు నాలుగుదిక్కుల ద్వారము లుండుట మంచిది.

సీ. అడరఁ జతుశ్శాల నడుమఁ జతుర్ద్వార
సదనంబు పుష్కరసంజ్ఞఁ దనరు
ప్రాఙ్ముఖంబున గృహరాడభిజ్ఞ వహించుఁ
బాటింప సకలసంపత్ప్రదంబు

* జక్రాఖ్యము.

దక్షిణముఖమైన ధనదపదాఖ్యచేఁ
బరగును సర్వసౌభాగ్యకరము
పడమటిముఖముగా భాసిలం బగునింద్ర
పదనామ మింద్రవైభవ మొసఁగు
సరవి నుత్తరముఖమైన వరుణపదము
రత్నములఁ గూర్చు రత్నాకరంబురీతి
నెలమి నిటువలె నిండ్లపై నిండ్లు దనర
చంద్రశాలలు రాజసంస్థానకములు. 198

చతుశ్శాలనడుమ నాలుగుదిక్కుల ద్వారములుపెట్టి కట్టిన సదనము పుష్కర మనఁబరగును. ఇందు సంపద లెడతెగక యుండును. చతుశ్శాలనడుమఁ దూర్పుద్వారముగల గృహము గట్టిన నది గ్రహరాజమని యెంచఁబడును. ఇందు సర్వసంపద లొప్పును. దక్షిణద్వారముఁ బెట్టికట్టిన గృహము ధనపద మని పించుకొనును. అందు నివసించువారు సకల సంపదల ననుభవింతురు. పడమటిద్వారము గలగృహమును నిర్మించినయెడల నది యింద్రపదమని పిలువఁబడును. అం దింద్రవైభవము ప్రాప్తించును. ఉత్తరద్వారముగల గృహము వరుణపద మగును. ఇందు రత్నలాభము గలుగును. ఇట్లు గృహములమీఁద గృహములు గట్టినఁ జంద్రశాలయగును. అందు రాజు లుండఁదగుదురు.

## అష్టవిధగృహదిఙ్నిర్ణయము

మ. అరయ స్నజ్జనశాల తూర్పుదెసఁ బాకాగార మాగ్నేయమా
యరుతన్, సుప్తిగృహంబు యామ్యమున శస్త్రాగారమా
నైరృతిన్, గురియా భోజనశాల పశ్చిమమునన్ గోశాల

వాయవ్యము,_త్తరమయ్యర్థగృహంబు శంకరుదెసఁ దైవా
లయంబుండగుఁ. 199

స్నానగృహము తూర్పుదిక్కునను, వంటశాల యాగ్నేయమునను, శయనగృహము దక్షిణమునను, ఆయుధాగారము నిరృతిదిగ్భాగమునందును, భోజనశాల పడమటను, పశుశాల వాయవ్యమునను, కోశాగారము_త్తరమునను, దేవాలయ మీశాన్యమునను నిర్మింపవలెను.

మధ్యగృహనిర్ణయము

సీ. ఇంద్రాగ్నిమధ్యమం దెనయును దధిశాల
యనలార్కజులమధ్య మాజ్యశాల
యమరాక్షసులమధ్యమము విరేచనశాల
దనరు విద్యాశాల దనుజవరుణ
మధ్యమంబునఁ బాశమారుతాంతరమున
నెనయు రోదనశాల ఘనసమీర
ధనదులనడుమను దగు భోగశాల ధ
నాధిపశివులమధ్యమము వైద్య
శాల శివవజ్రిమధ్యదేశముల నుండు
సూతికాశాల లీరీతిఁ జూచి చోద్య
మలర లక్షణశుద్ధి గృహస్థు లింట్ల
గట్టినను జెందు భోగభాగ్యములు కృష్ణ! 200

తూర్పునకును ఆగ్నేయమునకును మధ్యదేశమున దధి మథనశాలయు, ఆగ్నేయమునకును దక్షిణమునకును నడుమ నాజ్యశాలయు, దక్షిణమునకును నిరృతికిని నడుమ మలమూత్ర విసర్జనమున కనువగు శాలను, నిరృతికిని

పశ్చిమమునకును నడుమ నధ్యయనశాలయు, పశ్చిమమునకును వాయవ్యమునకును మధ్యను రోదనశాలయు, వాయవ్యమునకు నుత్తరమునకును నడుమ భోగశాలయు, ఉత్తరమునకును నీశాన్యమునకును నడుమ వైద్యశాలయు, ఈశాన్యమునకును తూర్పునకును నడుమ సూతికాశాలయు నిర్మింప గృహస్థులు సకల భోగభాగ్యముల ననుభవింతురు.

రంధ్రగృహపల్లీగృహకాచగృహలక్షణము

సీ. ఇంద్రార్కజులమీఁద నిండ్లుగట్టిన ధూమ
రంధ్రంబు సంతోషరహిత మగును
భానుజ వరుణులపై నిండ్లు గట్టిన
నసురరంధ్రం బిది పొసఁగ దంద్రు
వరుణధనేశులపై నిండ్లు గట్టిన
వాయురంధ్రంబు సర్వమును జెఱుచు
ధనదామరేశ్వరస్థానంబులం దిండ్లు
కాకరంధ్రం బిది కార్యహాని
ఇంద్రవరుణులపై నెదురిల్లు పల్లి
నామసదనంబు ద్రవ్యవినాశనంబు
శమనధనదులచోటిసద్మమ్ము కాచి
సంజ్ఞ మది జ్ఞాతివైరంబు సంఘటించు. 201

తూర్పున నొకగృహమును దక్షిణమున నొకగృహమును గట్టి యాగ్నేయమున గృహము లేనట్లుజేసిన నాగృహము ధూమరంధ్ర మనఁబరగును. అందు సంతోషమనునది ఉండదు. దక్షిణమున నొకటియు పడమట నొకటియుగఁ గట్టినగృహము అసురరంధ్ర మనిపించుకొనును. అందు మేలు గలుగనేరదు.

పశ్చిమోత్తరములఁ గట్టినగృహము వాయురంధ్ర మగును. అది కార్యహానిని గూర్చును. ఉత్తర పూర్వములయందుఁ గట్టిన గృహము కాకరంధ్ర మనఁబడును. ఇందును కార్యములన్నియు భగ్నములగును. తూర్పునను పడమటను గట్టిన గృహములు పల్లీగృహములని వ్యవహరింపఁబడును. అందు ద్రవ్యనాశము గలుగును. దక్షిణమునను ఉత్తరమునను గట్టినయిండ్లు కాచీ గృహము లనఁబరఁగును. దాయాదులతోఁ గలహము గలుగు చుండును.

## నాట్యశాలా లక్షణము

తే. వెలుపు ముప్పదియాఱంగుళు లెలమి నిడుపు
హస్తషట్త్రింశకము పొడవైనద్వార
ముత్తరమొకాని పడమట నొందెఁ జుట్టు
జాలకము లుంచ నర్తనశాల కృష్ణ. 202

వెడల్పు ముప్పదియాఱు చేతులును, పొడవు ముప్పది యాఱు చేతులును గలిగి పడమటఁగాని యుత్తరమునఁగాని పొడవగుద్వారముఁగలిగి నలువైపుల గవాక్షములుఁగలిగి నర్తన శాల యుండవలయును.

## మల్లశాలా లక్షణము

క. వెడలుపు నెనిమిదిచేతులు
నిడుపునఁ బదిరెండుహస్తనిర్ణయముల చొ
ప్పడుగరిడి యుపఙ్ముఖమయి
వడిఁ జుట్టు గవాక్షు లుంచవలయును కృష్ణా. 203

మల్లశాల యెనిమిదిచేతుల వెడల్పును, పండ్రెండు హస్తముల నిడివియుగలిగి యుత్తరమున ద్వారముగలిగి యుండవలయును. దానికిఁ జుట్టును గవాక్షు లుంచవలయును.

## అష్టవాటములు

తే. ఇంటి వెడలుపు నాల్గుపాళ్లైనయఁజేసి
అందు నొకపాలు గూర్చి భిత్త్యగ్రములను
హత్తి సూత్రము మధ్యమం బెత్తినప్పు
డదియ పాంచాలమను వాటమయ్యెఁ గృష్ణ. 204

ఇంటివెడలుపును నాలుగు పాళ్లుజేసి దానికి మఱియొక పాలుగూర్చి యాసూత్రముయొక్క రెండుకొనలను నడిగోడల మీఁద నిలిపి యాసూత్రము నడుమనుబట్టి యెత్త నది యెంత పొడవగునో అది పాంచాలవాట మని వ్యవహరింపఁబడును.

సీ. పాంచాలవాటంబు పైనంగుళులు రెండు
నర నిల్పవైదేహికాఖ్య మమరు
నిటువలెఁ గ్రమముతో నెక్కింప గౌరవ
*సౌజన్య మాగధాఖ్యములుశూర
సేనగాంధారముల్ చెలఁగు నవంతిక
వాటంబు లెనిమిది తేటపడును
సురల కవంతి భూసురులకు మాగధ
మారూఢి నృపులకు శూరసేన
మెలమి వైశ్యుల కౌరవ్య మలరుఁ బాద
జులకు వైదేహికము ప్రాకృతులకు మొదటి
వాట మగు గౌరవము సర్వవర్ణములకు
సరవి గాంధార మేనుఁగుశాలలకును. 205

* రాజన్య—పాఠాంతరము.

పాంచాలవాట ప్రమాణమునకు రెండున్నర యంగుళములు జేర్చినఁ వైదేహవాట మగును. ఆ వైదేహవాటమునకు రెండున్నర యంగుళము లెక్కించిన గౌరవవాట మగును. ఇట్లు క్రమముగ నెక్కించుచు వచ్చిన సౌజన్య మాగధ శౌరసేన గాంధారావంతికావాటము లెనిమిది యగును. అందు దేవతల కవంతియు, బ్రాహ్మణులకు మాగధమును, రాజులకు శూరసేనమును, వైశ్యులకుఁ గౌరవ్యమును, శూద్రులకు వైదేహికమును, ప్రాకృతులకు పాంచాలమును దగును.

## గజోష్ట్రాశ్వపశువులశాలల కాయనిర్ణయము

క. గజముల కుష్ట్రంబులకును
ధ్వజగజములు మఱియు నశ్వపశుసంతతికిఁ
ధ్వజవృషభంబులశాలలు
నిజముగ భువిఁ గట్టరేని నిల్చు సుఖంబుల్. 206

ఏనుఁగులకును ఉష్ట్రములకును ధ్వజాయగజాయములుచితములు. అశ్వములకును పశువులకును ధ్వజాయవృషభాయములు శ్రేష్ఠములు.

## దేవర అరుగులకు లక్షణము

తే. దేవరింటను గౌరీశుదెసను దేవ
వేదికి ధ్వజంబు సింహంబు వృషభ మలరు
అడుగు పాడ వంగుళంబులు హస్తిసంఖ్య
దించి మున్నెంచి యాయంబు లెంచవలెను. 207

దేవతలను బూజించునట్టి గృహమున నీశాన్యభాగమున దేవరయరుగు ధ్వజాయమైనను సింహాయమైనను వృషభాయమైనను గలిగియుండునట్లు చూచి వేదికను నిర్మించవలయును.

వేదికా ప్రమాణాంగుళముల నిడివిని వెడల్పుతో గుణింపఁగా వచ్చిన లబ్ధమును నెనిమిదితో భాగింపగా ౧ మిగిలిన ధ్వజాయ మనియు, 3 మిగిలిన సింహాయ మనియు, ౫ మిగిలిన వృషభాయ మనియు దెలియవలయును. ఈమూఁడాయములు తప్ప తక్కిన యాయములు పనికిరావు.

## వటువేదికా లక్షణము

తే. ఎనిమిదడగులనిడుపుతో నెనయు వెలుపు
పాదపట్కముతోఁ గూర్చి పరఁగఁ జేనెఁ
డున్నతము వేదిక యొనర్పఁ జెన్ను మిగిలి
వెలయు శాస్త్రంబు వటువేదికలకుఁ గృష్ణ! 208

వటువేదిక యెనిమిదడుగుల నిడివియు, ఆఱడుగుల వెడల్పును, జేనెఁడెత్తును గలిగియుండుట మంచిది.

## వివాహవేదికాలక్షణము

తే. వెలుపునిడుపును నాల్గుచేతులును నొకటి
పొడవు వేదిక యింటికి నెడమదిశను
చవికె యొనరించి సోపానసరణిఁ గూర్ప
విభవము లొసంగు వైవాహవేదియందు. 209

వివాహవేదిక నాలుగుచేతుల నిడివిని, నాలుగుచేతుల వెడల్పును ఒకచేయియెత్తును గలిగియుండవలెను. దానిని ఇంటి యెడమ దిక్కునఁ గట్టి సోపానములను దీర్చి చవికె వేయ వలయును.

## కూపఖనన లక్షణము

సీ. ఈశాన్యమునఁ బుష్టి యేప్రొద్దుఁ దనరును
పొలుపొందఁ దూర్పునఁ గలిమి చెందు

ఆగ్నేయమునఁ బుత్త్రహరణంబు గావించు
శమనుదిక్కున నున్న సతికి నష్టి
నిరృతిదిశయందు నెనయు మృత్యుభయంబు
పశ్చిమంబునఁ గల్గు భాగ్య మెపుడు
వాయవ్యమున వచ్చు వైరులచే బాధ
యక్షరాడ్దిశయందు నల్పసుఖము
మధ్యమంబున ద్రవ్యంబు మడిసిపోవు
నవని నీరీతిఁ దిక్ఫలం బరసి త్రవ్వ
వలయు బావులనిలయంబునెళవు దెలిసి
సుగుణు లైనట్టిమానవు ల్నిగమవేద్య! 210

ఈశాన్యమున బావిని త్రవ్విన మేలుగలుగును. తూర్పునఁ ద్రవ్వినఁ గలిమియు, ఆగ్నేయమునఁ బుత్త్రనాశమును, దక్షిణమున భార్యానాశమును, నిరృతిదిశయందు మృత్యుభయమును, పశ్చిమమున భాగ్యమును, వాయవ్యమున శత్రుభయమును, ఉత్తరమున నల్పసుఖమును, గృహమధ్యమున ద్రవ్యహానియుఁ గలుగును. కాఁబట్టి శాస్త్రము నెఱిఁగి ఉచితమగుచోట బావిని ద్రవ్వవలయును.

### ఉద్యానవన లక్షణము

సీ. ద్రాక్షాపనసనింబదాడిమాశ్వత్థచం
పకపూగపాటలీబంధుజీవ
నారికేళాశోకనారంగవకుళఖ
ర్జూరపున్నాగజంబీరతిలక
మల్లికాజాతీసమన్వితభూజల
తాంచితం బైనగృహాంగణంబు

శ్రీప్రదం బగుబదరీవృక్షమ్లక్షము
లుత్తరంబున శుభం బొదవు మేడి
మఱ్ఱిరావులు నలువట్లు మంచివంద్రు
అగిసెమాదిఫలద్రుమ మరఁటి జెముడు
పసుపు లోగిటఁ బెరుచాను ప్రభవమైన
యచటఁ గీడగు సంద్రు పద్మాయతాక్ష! 211

ద్రాక్ష, పనస, వేము, దాడిమ, రావి, సంపెంగ, పోక, కలిగొట్టు, దానానము, నారికేళము, అశోకము, నారంగము, పొగడ, ఖర్జూరము, సురపొన్న, నిమ్మ, తిలక, మల్లె, జాజి - అను నీవృక్షములు ముంగిటనుండిన శ్రీకరము. రేఁగుచెట్లు రెండు జువ్విచెట్లు ఇంటి కుత్తరముననున్న శుభము. మఱ్ఱి, రావి అను నీ వృక్షములు గృహమునకు నలువైపుల నుండవలయును. అవిసె, మాదీఫలము, అరఁటి, జెముడు, పసుపు అనునవి తమంతఁ దాము ముంగిట మొలిచిన మంచిదికాదు.

## ఉలూఖలస్థాపనము

క. మందుఁడు శాశ్వతలగ్నము
లందేనిఁ దదంశలందు నలరఁగ రోలుఁ
బొందింప ధాన్యవర్ధన
మొందించును బ్రతిదినంబు నుత్సవ మలరన్. 212

శని స్థిరలగ్నమునవైనను, స్థిరాంశలనైనను నుండఁగ రోలును నిలుప ధాన్యవృద్ధి నిత్యమహోత్సవము కలుగును.

## పదుల్లునిలుపుటకు లక్షణము

తే. వేదిక గజాయమునఁ జేసి విధునివార
మిందునక్షత్రమునఁ దులావృషభలగ్న

ములను జలరాసులను గవి నిలుచునపుడుఁ
బూర్ణకుంభము లుంచినఁ బొసఁగు జయము. 213

గజాయమున వేదిక నిర్మించి మృగశీర్షానక్షత్రముతోఁ గూడిన సోమవారమునఁ దులావృషభ లగ్నములలో నెద్దానియం దైన శుక్రుఁడు సంచరించుచున్నపుడు లేక జలరాసులందు శుక్రుఁ డుండఁగానైనను గుంభములు నిలుపవలయును.

**ప్రాయ్యి వేయుటకు లక్షణము**

గీ. వహ్నినక్షత్రమునఁ గుజవాసరమున
లగ్నముననైన సప్తమారాశినైనఁ
గుజుఁడు వసియించుతఱి హోమగుండములను
బ్రాయ్యి పొందింప భాగ్యము ల్పొదలు కృష్ణ! 214

కృత్తికానక్షత్రయుక్తాంగారక వారమునందు అంగారకుఁడు లగ్నముననైనను లగ్నమునకు సప్తమరాశినైనను నుండ హోమగుండములు, ప్రాయ్యిలు మొదలగువానిని నిర్మింపవలయును.

**మంచములు, పీటలు**

క. శయ్యాసనయంత్రంబులు
చయ్యన రచియింప ధ్వజవృషభసింహాములఁ
నెయ్యంబగు నితరక్రియ
లొయ్యన రచియింప ధ్వజమె యుత్తమము హరీ! 215

మంచములకును, పీటలకును ధ్వజవృషభసింహాము లుచితములు. సకలకార్యములకును ధ్వజాయ ముత్తమము.

### కంచములు దొలిచి నీళ్లను జల్లవలసిన దిశలు

తే. ఎలమి భుజియించుకంచముల్ దొలిచి చల్లు
దిశలఫల మెన్న సురపతిదిక్కు మొదలు
గాఁగ గల్మియు మానభంగమును మృతియుఁ
దెవులు సిరి పగ ధనము భూతియును గృష్ణ! 216

కంచము కడిగి యానీళ్లను దూర్పునఁ జల్లినఁ గలిమియు, ఆగ్నేయమునఁ జల్లిన మానభంగమును, దక్షిణమునఁ జల్లిన మృతియు, నిర్మతియందుఁ జల్లినఁ దెవులును, (పశ్చిమమునఁ జల్లిన సంపదయు,) వాయవ్యమున వైరమును, (ఉత్తరమునఁ జల్లిన ధనమును,) ఈశాన్యమునఁజల్లిన భాగ్యమును గలుగును.

శా. సేవ్యశ్రీపదపద్మపద్మసదనాశృంగారవాఙ్మాధురీ
భవ్యస్వాంతవిహార హారకలిత ప్రస్తుత్య వక్షస్థలీ
భవ్య శ్యామలవర్ణ వర్ణితలసద్భాంధవ్య సౌహార్దసా
చివ్యామోదితధర్మ ధర్మనిరత క్షేమంకర ప్రాభవా. 217

క. విధుతరణిస్ఫుటలోచన
మధుసూదన దివ్యనామ మంజులకరుణా
బుధజనమునిపరిపాలన!
కుధరవరోద్ధరణ మదనగోపాలహరీ! 218

మాలిని. విమలచరితహృద్యా వేదవేదాంతవేద్యా
సమధికగుణగణ్యా సర్వదేవాగ్రగణ్యా
అమరవినుతిపాత్రా అంబుదశ్యామగాత్రా
ప్రమథితశిశుపాలా రాజగోపాలబాలా! 219

క. మీచరణార్పితమతి ప్ర
జ్ఞాచతురిమ వాస్తుసారసంగ్రహ మెలమిన్
నే చేసినాఁడ నిద్ధర
నాచంద్రార్కముగ నిల్పుమయ్య ముకుందా! 220

గద్య. ఇది శ్రీ మదనగోపాలస్వామికృపాకటాక్షవీక్షణప్రసాదాసాదిత సకలగణితప్రశ్నసవిస్తార శాస్త్రాంబురాశి ప్రమథనమందరాచలాయమానమేధావైశద్యానవద్య హృద్యచరిత్ర మహాశ్వలాయనసూత్ర వాసిష్ఠసగోత్రపవిత్ర వేరుసోమలగణపయామాత్యపౌత్త్ర వేంగళామాత్యపుత్త్ర మల్లమాంబాగర్భశుక్తిముక్తాఫలవిరాజమానసుధీజనవిధేయ గణపయనామధేయప్రణీతంబైన వాస్తుసారసంగ్రహ లక్షణంబన్నది సర్వంబు నేకాశ్వాసము.



---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1956

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చతెనుఁగురామాయణము | ... | 2 | 8 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | ... | 1 | 0 |
| అనుభవసారము, పాలకుఱికి సోమనాథ ప్రణీతము | ... | 1 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | ... | 0 | 12 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 8 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక, ప్రతిపది | ... | 8 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు గలసంపుటము | ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | అచ్చు | |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటే సంపుటము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | అచ్చు | |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము, మూలము | ... | 0 | 3 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు | | | |
| కాలికో | ... | 2 | 0 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 2 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 4 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, | | | |
| 3 సంపుటములు | ... | 15 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 18 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 3 | 0 |
| కవికంఠోక్తి | ... | 0 | 4 |
| కవిజనాశ్రయము | ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి | ... | 1 | 4 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కవిజనరంజనము | ... | 0 | 12 |
| కవిగజాంకుశము | ... | 0 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 12 |
| కాశీఖండము | ... | 3 | 8 |
| క్రీడాభిరామము, శ్రీవల్లభరాయప్రణీతము | ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 8 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్యశర్మగారిది | | 0 | 12 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారిది | ... | 0 | 12 |
| గరుడాచలము - యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 4 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 6 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | అచ్చు | |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |
| ఛందోదర్పణము (అనంతుని ఛందము) | ... | 2 | 0 |
| జైమినీభారతము | ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 3 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధనాభిరామము | ... | 0 | 12 |
| ధర్మఖండము స్కాందపురాణాంతర్గతము 1, 2 భాగములు | | 5 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకార సంగ్రహము) | | 3 | 0 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 12 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 13 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 12 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడది | ... | 2 | 8 |

| | | ప్రతి 1-కి రు॥ | అ॥ |
|---|---|---|---|
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 2 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళి సూరన | ... | 2 | 0 |
| పరమయోగివిలాసము, ద్విపద, తాళ్లపాక తిరువేంగళనాథుడు | | 2 | 8 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 0 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 5 | 0 |
| బ్రహ్మోత్తరఖండము | ... | 3 | 0 |
| బసవపురాణము, ద్విపద, చిన్నసైజు | ... | 4 | 8 |
| బిల్హణీయము | ... | 1 | 4 |
| బేరీజుపద్యములు | ... | 0 | 4 |
| భక్తిరసశతకసంపుటము, II, 20 శతకములు | ... | 3 | 0 |
| భగవద్గీతా కందార్థములు | ... | 1 | 4 |
| ,, శ్రీగోపినాథ వేంకటకవికృతము, పద్యకావ్యము | | 1 | 4 |
| భారతసావిత్రి | ... | 0 | 2 |
| భాస్కరరామాయణము | ... | 8 | 0 |
| భోగినీదండకము | ... | 0 | 2 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 4 | 0 |
| మల్లభూపాలీయము, నీతిశతకము, ఎలకూచి బాలసరస్వతీది, వేదము లక్ష్మీనారాయణశాస్త్రి టీకతో | ... | 1 | 8 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 4 | 0 |
| మొల్లరామాయణము | ... | 1 | 8 |
| యతిరాజవిజయము, దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి | ... | 0 | 10 |
| యయాతిచరిత్ర, పొన్నికంటి తెలగనార్య | ... | 2 | 0 |
| డిటో ఆకొండి వ్యాసమూర్తిగారిది | ... | 0 | 3 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 6 |

# శతకములు

| | రూ. | అ. |
|---|---|---|
| కుమార | 0 | 4 |
| కుమారీ, సటీక | 0 | 4 |
| కృష్ణశతకము | 0 | 2 |
| ,, దూపాటి | 0 | 2 |
| గువ్వల చెన్న | 0 | 3 |
| గొట్టుముక్కుల రాజగోపాల | 0 | 2 |
| చంద్రశేఖర | 0 | 3 |
| చిత్తబోధశతకము | 0 | 3 |
| చెన్నమల్లుసీసములు | 0 | 2 |
| జగన్నాయక | 0 | 2 |
| జ్ఞానప్రసూనాంబిక | 0 | 2 |
| దాశరథి, టీక | 0 | 8 |
| దేవకీనందనశతకము | 0 | 3 |
| నారాయణశతకము | 0 | 3 |
| నారాయణ పోతనది | 0 | 3 |
| నీలకంఠశతకము | 0 | 6 |
| నృసింహ | 0 | 4 |
| నృకేసరి | 0 | 2 |
| పార్థసారథి | 0 | 2 |
| ప్రసన్నరాఘవ | 0 | 3 |
| బాలనీతిశతకము | 0 | 2 |
| భద్రగిరి | 0 | 2 |
| భద్రాద్రిరామ | 0 | 3 |
| డిటో పరశురామ నరసింహదాసు | 0 | 4 |
| భక్తచింతామణి | 0 | 3 |
| భాస్కర, టీక | 0 | 8 |
| శ్రీమల్లేశ్వర | 0 | 4 |
| మదనగోపాల | 0 | 2 |
| మహిషాసురమర్దని | 0 | 2 |
| మహిజామనోహర | 0 | 2 |
| మారుతీ | 0 | 2 |
| మానసబోధ | 0 | 3 |
| మాతృ | 0 | 2 |
| మాధవ | 0 | 2 |
| మిత్రశతకము | 0 | 2 |
| ముకుంద | 0 | 2 |
| ముకుందరాఘవ | 0 | 4 |
| యాదగిరీంద్ర | 0 | 2 |
| రమాధీశ్వర | 0 | 2 |
| రంగేశ | 0 | 4 |
| రంగశాయి | 0 | 2 |
| రఘురామ | 0 | 2 |
| రఘుతిలక | 0 | 2 |
| రమణీమనోహర | 0 | 4 |
| రామరాఘవ | 0 | 2 |
| రామప్రభు | 0 | 2 |
| రాజశేఖర | 0 | 2 |
| రామచంద్ర | 0 | 4 |
| రామలింగేశ | 0 | 3 |
| రామతారక | 0 | 4 |
| రుక్మిణీపతి | 0 | 2 |
| రేఫాల రాజలింగ | 0 | 4 |
| లక్ష్మీ | 0 | 2 |
| లావణ్య | 0 | 4 |
| వసుదేవనందన | 0 | 2 |

| | రూ. | అ. | | రూ. | అ. |
|---|---|---|---|---|---|
| విశ్వనాథ | 0 | 4 | శివముకుంద | 0 | 2 |
| వీరనారాయణ | 0 | 2 | సర్వేశ్వర | 0 | 2 |
| వృషాధిప | 0 | 2 | సంపగిమన్న | 0 | 2 |
| వేమన | 0 | 4 | సదానందయోగి | 0 | 2 |
| వేంకటేశ | 0 | 4 | సర్వమంగళా | 0 | 3 |
| వేణుగోపాల | 0 | 4 | సర్వలోకేశ్వర | 0 | 2 |
| శరభాంకలింగ | 0 | 3 | సింహాద్రినారసింహ | 0 | 6 |
| శార్దూలశతకము | 0 | 4 | సీతాపతి | 0 | 2 |
| శివశతకము | 0 | 2 | సుమతి, టీక | 0 | 5 |
| శిఖినరసింహశతకము (శకున శాస్త్రము | 0 | 8 | సూర్యనారాయణ | 0 | 2 |
| | | | సూర్యశతకం శ్లోకసహితమ్ | 0 | 8 |

## పెద్దచ్చు వగైరా శతకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| అమరము, ప్రథమకాండము, మూలము | 0 | 4 | ప్రసన్నరాఘవ | 0 | 2 |
| ఆదిపర్వము, పెద్దచ్చు, చిన్న సైజు | 1 | 8 | రుక్మిణీకల్యాణము | 0 | 4 |
| కాళహస్తి | 0 | 2 | బాలరామాయణము | 0 | 2 |
| కుమారీశతకము | 0 | 2 | భాస్కర | 0 | 2 |
| కృష్ణ | 0 | 3 | మానసబోధ | 0 | 2 |
| గజేంద్రమోక్షము | 0 | 4 | రామరాఘవ | 0 | 2 |
| గరుడాచలము | 0 | 6 | రామలింగేశ | 0 | 3 |
| దాశరథీ | 0 | 2 | రామతారక | 0 | 4 |
| నారాయణ | 0 | 3 | రామరామ | 0 | 2 |
| నృసింహ | 0 | 3 | వేణుగోపాల | 0 | 4 |
| | | | శిఖినరసింహ | 0 | 4 |
| | | | సుమతిశతకము | 0 | 2 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| సాముద్రికశాస్త్రము, సటీక | ... | 0 | 8 |
| ,, తెలుఁగుపద్యకావ్యము | ... | 0 | 8 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | ... | 6 | 0 |
| హస్తరేఖాశాస్త్రము, వడ్డాది వీర్రాజు సిద్ధాన్తి | ... | 2 | 0 |
| హోరారత్నమాల, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |

## వేదాంతగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| అద్వైతసంగ్రహము, తెలుఁగువచనము | ... | 0 | 3 |
| ఆత్మబోధము, సాంధ్రటీక | ... | 0 | 8 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 6 |
| అపరోక్షానుభూతి ,, | ... | 0 | 8 |
| అద్వైతపంచరత్నములు ,, | ... | 0 | 3 |
| అద్వైతోపదేశపంచరత్నములు,, | ... | 0 | 3 |
| అష్టోత్తరశతోపనిషత్తులు, మూలము | ... | 10 | 0 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| ఆత్మవిద్యావిలాసము ,, | ... | 0 | 12 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 8 |
| ఉత్తరగీతా, సటీక, చిన్నసైజు | ... | 1 | 0 |
| పంచదశీప్రకరణము, సవ్యాఖ్యాసాంధ్రటీకాతాత్పర్యసహితము | | 12 | 8 |
| విచారచంద్రోదయము, వచనము | ... | అచ్చు | |
| వేదాంతస్తోత్రపంచకము, తాత్పర్యసహితము | ... | 0 | 6 |
| శ్రీవిద్యారణ్యకృతజీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యసహితము | | 3 | 0 |
| శివగీతా, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 1 | 4 |
| సదాముక్తిసుధార్ణవము సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | ... | 0 | 10 |
| రామగీతా , | ... | 1 | 4 |
| సనత్సుజాతీయము, సటీక | ... | 0 | 8 |
| శాంతివిలాసము ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 6 |
| సౌందర్యలహరి, ఆంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 12 |
| బ్రహ్మసూత్రములు, మూలము | ... | 0 | 4 |

ప్రతి 1-కి రూ

శ్రీ శతఘంటము వేంకటరంగశాస్త్రిగారి ఆంధ్రవచనభాగవతము,

| | | |
|---|---|---|
| ద్వాదశస్కంధములు, ఒకటేసంపుటము | ... | 9 |
| ,, మూడుసంపుటములు | ... | 10 |

విజయనగరమహారాజావారి సంస్కృతకళాశాల అధ్యాపకులు
శ్రీ ఆకొండి వేంకటశాస్త్రి విరచిత ఆంధ్రవచనభారతము

| | | |
|---|---|---|
| ఆదిసభాపర్వములు | ... | 5 |
| ఆరణ్యపర్వము | ... | 5 |
| విరాటోద్యోగపర్వములు | ... | 5 |
| భీష్మద్రోణపర్వములు | ... | 7 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 |
| శాంతిపర్వము | ... | 7 |
| అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వమువరకు | | 7 |

పచ్చయప్పకళాశాల తెలుగుపండితులు శ్రీ సరస్వతుల సుబ్బ
రామశాస్త్రి విరచిత ఆంధ్రవచనవాల్మీకిరామాయణము

| | | |
|---|---|---|
| బాలకాండము | ... | 2 |
| అయోధ్యాకాండము | ... | 5 |
| అరణ్యకాండము | ... | 2 |
| కిష్కింధాకాండము | ... | 2 |
| సుందరకాండము | ... | 3 |
| యుద్ధకాండము | ... | 7 |
| ఉత్తరకాండము | ... | 3 |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | ... | 3 |
| అరేబియన్ నైట్సుకథలు, పంగూరి సుబ్బారావు | ... | 2 |
| చిత్రరత్నాకరము, గుర్జాడ శ్రీరామమూర్తిగారిది | ... | 1 |
| 'సైన్సు'పై లోకహత్యారోపణ (ప్రహసనము) | ... | 0 |
| తిలకుగారి సెక్యూరిటీ కేసు, ఉపన్యాసములు | ... | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి